# శతకత్రయము.

(జానకీధవ, వేంకటేశ, శంకర
శతకములు.)

---

గ్రంథకర్త:
కొణిదెన వేంకటనారాయణ.

ప్రథమ ముద్రణము 500.

వాణీ ముద్రాక్షరశాల,
బెజవాడ.

1930.

 [వెల రు 0—4—0.

# మనవి.

భక్తాగ్రేసరులారా!

సర్వ జగదంతరాత్మయగు వాసుదేవుని లీలావతారంబు లనంతంబులు. అందునే యవతారమూర్తియందు భక్తుని మానసంబు హత్తియుండునో యా యవతార గుణగణంబును తన్మహిమంబును వొగడి తన మనోదిష్ట విషయములను శతకరూపమున నివేదించుకొనుట యొక్క సనాతనాచారము. ఇట్లు నివేదించుకొన్న మహామహులైన కవివరేణ్యులనఁదగు శతకకర్త లనేకులుగలరు. "సర్వదేవ నమస్కార శ్రీకేశవం ప్రతిగచ్ఛతి" యన్నట్లు భక్తుఁడే దైవంబుఁ బేర్కొని నుతించినను, మొఱనిడుకొన్నను సర్వము సర్వాత్మయగు శ్రీమన్నారాయణునినే చేరుచుండును.

అల్పజ్ఞుఁడ, కేవల విషయగ్రాహకుఁడ నే నారీతి శతకంబులఁ బూరించుటకు నా కేమాత్రము నధికారము లేదుగాని, ఆ సర్వేశ్వరుని నోరార నాకొకమారు స్మరించిన మహిమాతిశయంబువలన గాబోలు నీ శతకత్రయంబు నీరీతిఁగూర్పమిక్కిలి యాసక్తి వొడమి సఫలమనోరథుండనైతి. కరుణాసాంద్రుండగు నా యుపేంద్రున కొక్క తులసీదళ మర్పించి భక్తుండు పరమానంద భరితుండగునట్లు భక్తి పురస్సరంబుగా నాశక్తికొలది నీ శతకత్రయంబు రచియించి యా పరమాత్మ పదకమలంబుల నలంకరించి ధన్యుండనైతి.

ఇందున్న శంకరశతకము తొలుత వ్రాసియుంటి. వేంకటేశ శతకము నా వ్యాధి నివృత్తికొరకు సంకల్పించి శంకరశతకమునకు నావల వ్రాసితి. శతకంబున బేర్కొన్నయట్లు ఆ వేంకటాద్రి రమణుని మహిమచేత శతకము పూర్తియగులోపల నా కారోగ్యము

గలిగి సుఖంబుంటి. ఈ శతకమునకు పిమ్మట జానకీధవ శతకము పూర్తిచేసితి. ఇందుగల దాతృప్రశంసలో బాపట్ల కాపురస్థులగు శ్రీ బ్రహ్మాండం బాపయ్య పంతులుగారి భార్యా రామాబాయమ్మ గారియు, వారిపుత్రరత్నము వేంకట లక్ష్మీనారాయణరావు పంతులుగారియొక్కయు మహా త్యాగశీలతకు నలరి లోకంబునకు తెలియఁజెప్పితిఁగాని వేరు, కారణముగాదు. కొణిదెన గ్రామనివాసుఁడ నగుటవలనను, అచ్చట అనాదిగా వేంచేసియుండు శ్రీ శంకరమహిమ పొగడ నరిదియగుటను, కొణిదెన పురవిహార! శంకర! యను మకుటముఁ జేర్చి ఆ యుమాపతి కా శతకమర్పించితి.

సాహిత్యపటిమ లేకున్నను, గుణసంపద లేశము గాంచకుండినను, కవిత్వము సలక్షణము గాకున్నను, భగవత్కృతిగా వ్రాసితి గాన, నా శతకంబుల సాధుసత్తములు నిందించబోరు. ఇందుగల తప్పులఁ దెలిపిన బుద్ధిమంతులకు కృతజ్ఞుఁడను. విద్వద్వరేణ్యులు నా యజ్ఞానము సహింతురుగాత. సర్వ భూతాంతర్వర్తియగు జానకీధవుండు భక్తాభీష్టంబుల నొడఁగూర్చుఁగాత.

రాజుగారిపాలెం,<br>నర్సారావుపేట తాలూకా.<br>11—10—1930.

ఇట్లు విన్నవించుకొను<br>హరిహరభక్తుల పాదరేణువు,<br>కొణిదెన వేంకట నారాయణ,<br>ప్రాథమికోపాధ్యాయుఁడు.

# దాతృప్రశంస

క॥ శ్రీకరమును, దాతృప్రశం
సాకలితము, పుణ్యతరము సజ్జనహృత్ప
ద్మాకరము సునీతిపథం
బౌకథ నొకఁడార్యమనములలర వచింతున్. 1

సీ॥ విమలయశంబున వినుతికెక్కినయట్టి । యోడరేవుకుల మీయుర్విఁ జెలగు
నావంశమున సుబ్బయాఖ్యుండు సర్వగు । ణాస్పదుండు జనించి యాత్మపత్ని
సతిమహాలక్ష్మిసచ్చరితతో సంసార।ధర్మంబుఁ బాటించి తగ మెలంగఁ
దమపూర్వపుణ్యంబుఁ దముఁ జెందఁదరియైన । భూరియదృష్టంబు బొందనైన

గీ॥ వారి వంశాంబురాసికిఁ బద్మయనఁగ
సర్వసద్గుణకలిత! ప్రశస్తచరిత!
స్త్రీలతలకట్టు! కరుణకు మేలిపట్టు!
పున్నెములదొంతి! యొకయింతి పుట్టె కాంతి!. 2

ఉ॥ పెద్దలు రామబాయి యని పేరిడి బిడ్డకు, జన్మలగ్నమా
ప్రొద్దగుణించి, యీమె బహుపుణ్యసుశీల! సుభక్తిసాంద్ర! యు
ష్మద్దురితంబు బాచికొని సద్గతిఁ గాంతు సుపుత్రి పుట్టుటన్
సిద్ధము; సుబ్బయార్యయని చెప్పిరి తండ్రికి చిత్తమింపుగన్. 3

ఉ॥ తల్లియుఁ దండ్రియున్ గడుముదంబునఁ బెంపఁగ, యూరనున్నవా
రెల్లరు నామెసద్గుణము లెంచి నుతింపఁగఁ, బెండ్లియాడుదా
నల్లనవచ్చె రామమకు, నంతగుణాఢ్యుని బాపయాఖ్యుఁడా
నుల్లమునందు మెచ్చి, సుగుణోదధి సుబ్బయయిచ్చె పుత్రికన్॥ 4

గీ॥ పుట్టునింటికిఁ దు యగునట్టికీర్తి
మలయు, బ్రహ్మండవంశసంభవుఁడు బాప
యాభిధాను కేల్ పట్టి, కాత్యాయని శివు
గలసి వెలసినరీతి యాగరిత పొలిచె॥ 5

చ॥ అయమభాగ్యమే మొ తను నచ్చట పెండిలియైన వెండి నా

దాయము వృద్ధియై సిరికిఁ దావలమయ్యె విభుండు; రామమాం
బాయెడ భర్త తన్నుఁ బ్రియమారఁగనుంగొన, నిష్టసౌఖ్యసం
ధాయినియై సుఖించెఁ గనె; ధర్మవిచారుఁ గుమారునొక్కనిన్॥ 6

క॥ వారికి నరుదుగఁబుట్టిన
కారణమునఁ బ్రాణసమముగా సుతుఁ బెంపన్
ధీరుఁడు వేంకటలక్ష్మీ
నారాయణరావు ఘనుడనం ధరఁ బెరిగెన్॥ 7

చ॥ తనయుని ముద్దుముచ్చటలు దద్దగనుంగొనకుండ బిడ్డకే
డెనిమిదియేండ్లు నిండఁబరమేగెను తండ్రి; కుమారునోముచున్
ఘనమతిరామమాంబ సిరిగల్గిన కాపురమొప్ప దిద్దుకొం,
చనయము దైవమేగతియటంచు, భజింపుచు వీతరాగయై॥ 8

గీ॥ సుతుఁడు తనయాజ్ఞమీరక సారిదినడువ,
భర్తచనఁదానయంతకుఁ గతఁయగుట
త్యాగ సంశీలయౌట, సద్ధర్మములను
సేయుచుం దత్త్వబోధంబుఁ జెందఁదలఁచె॥ 9

గీ॥ తలఁచినట్టులె తానుండు నెలవుభావ
పురమునకునొక్క సన్యాసి, బుధనుతుండు
తీర్థపాదబ్రహ్మనంద తీర్థనాముఁ
డల్లవచ్చెను; సుజనాళి యుల్లమలర॥ 10

ఉ॥ ఆయతిసార్వభౌముఁడహహా! యటకాలిడినంత పండితుల్
శ్రీయుతులున్ దరిద్రులు నశేషజనంబులుఁ దన్నుఁగొల్చి య
య్యా! యమఁహాత్మ! మామనములందలి యజ్ఞతఁబాపవేయటం
చేయెడఁ దామయైవెలసి; రెంతయుఁదాపసి సంతసింపఁగన్॥ 11

ఉ॥ వేదపురాణశాస్త్రములు, విశ్రుతపద్ధతు, లాగమాంతముల్
సాదరబుద్ధినెల్లరకుఁ జక్కఁగఁదెల్పుచు, ద్వైతభావముల్
వేదొలగింప భాష్యములు వేమరుఁజెప్పుచు, మంత్రరాజముల్
బోధయొనర్చు, చాయతిసుబోధ సమగ్రతఁదీర్చె శిష్యులన్॥ 12

ఉ॥ ఆమహనీయుపాదముల నాత్మభజింపుచు మంత్రరాజమున్
బ్రేమఁబఠింపఁజెంది, గురునిష్ఠ గుహూత్తమునాత్మకెక్క, హ్రా

ద్ధామమునందు శాంకరిని దా నెడబాయక శాంతచిత్తయై
భూమసుఖాప్తికిందగిన బుద్ధిగణించెను; రామమాంబయున్॥ 13

ఆ॥వె॥ తావివేకియైనఁ దన కెంతగలిగిన
నేమి నేర్చియున్న నేమి లేదు;
శక్తికొలఁది మేలు సల్పనౌ పరులకు
ననుచు రామమాంబ యప్పుడు దలఁచి॥ 14

సీ॥ వెలయించెశంకర విద్యాలయంబన। బ్రథవహించిన వేద పాఠశాల
ద్వాదశయకర క్షేత్రముదాన మొనరించె। విప్రులవిద్యాభివృద్ధికొరకు
శోభించనభినవ సోమేశు, బాలాత్రి। పురసుందరిని, గజముఖునినిలిపె
తద్దేవతలకు సంతతమునుజరుగనౌ। విభవంబులకును గావించె వసతి
గీ॥ ధ్వజము వేయించె; వచ్చినవారి కెల్ల
లేదనక, నన్న మొసఁగుచు నాదరించె;
భూరిదక్షిణలొసగెను భూసురులకు;
పాత్రులకు దశ దానముల్ బరగనడపె;॥ 15

క॥ పేర్మిను దత్తాత్రేయ
స్వామిని, గాయత్రి, యకరషట్కముపూజా
నీమాదులకిడి, ప్రభతో
రామాంబ ప్రతిష్ఠసలిపె రాజితబుద్ధిన్॥ 16

చ॥ చెలువుగవాహనంబులఁ బ్రసిద్ధిగనెన్నియొగల్గఁజేసెఁ, బెం
పలరఁగ నన్నసత్రము సదాజరిపించుచునుండె; మంచి బా
వులు నెలకొల్పె; దీర్ఘముగపూర్ణవ్రతంబులనోమె; సంయమీం
ద్రులఁదోడితెచ్చి కట్టనిడి తోషమెలర్పభుజింపఁజెట్టెడిన్॥ 17

ఉ॥ బీదలుకోరి రే వడుగుఁ బెండిలులాదటసేసిపంపు, న
న్నాదులొసంగి బిడ్డలటులారయు విద్యగడించుబాలురన్;
భేదములేక బంధులకుఁ బెంపుగనిచ్చు; బరోపకారమే
చేఁదవిలుండు నిత్యముఁ; బ్రసిద్ధచరిత్రకు రామమాంబకున్॥ 18

సీ॥ గంగగౌతమికృష్ణకావేరిముఖ్యతీ, ర్థములకోపిక నేగి తానమాడి
అందందుఁదీర్ఘశ్రాద్ధాదికర్మలొనర్చి, యాచకజనములకలరనిచ్చి
శ్రీకాశిద్వారకగోకులనైమిశ, గయప్రయాగయయోధ్యకంచిమధుర

రామేశ్వరంబు శ్రీరంగమాతిరుపతి, శ్రీకాళహస్తియు, శ్రీనగంబు
గీ॥ ధరఁ బ్రసిద్ధమహాక్షేత్రములఁ దిరిగితిరిగి,
యచట దేవతాగణముల కర్చచేసి,
కన్నులలర వీక్షించి, నిక్కంపుభక్తి,
మ్రొక్కి వినుతించి, ధ్యానించి ముదమునించి॥ 19
గీ॥ ఇచ్చఁ దీర్థప్రసాదముల్ దెచ్చి గృహముఁ
జేరుకొని సమారాధన సేసి, భూరి
దక్షిణ లనూనముగనిడి, ధర్మమార్గ
దర్శియైనిల్చె రామాంబ! ధరణికెల్ల॥ 20
క॥ ఆరయ వేంకటలక్ష్మీ
నారాయణరావుసద్గుణంబులఁ దల్లిన్
మీరిన, నాయమయాజ్ఞన్
మీరఁడు, రామాంబకలిమి మేరయె పొగడన్?॥ 21
గీ॥ బాలకనకసుందర్యాఖ్య బరగుపౌత్రి
కనులముందర నాడుచు మనమునింప,
కోడలగు బుల్లెమాంబ తన్గొలువ, సుతుఁడు
నాజ్ఞమెగంగ రామాంబ యలరుచుండె॥ 22
చ॥ పరహితబుద్ధి నీగతికృపాపరతన్ గురుధర్మగామియై
యరుదగు దైవభక్తి, శుచి, యాత్మ నెఱింగెడు బుద్ధి, నిర్వృతిన్
వరగురుసేవ, శ్రద్ధ, శుభవాంఛ, మనంబున బాయకుండ, కా
పురమున నంటఁబోక, యతిఁబోలె నిరంతరమోదమందుచున్॥
గీ॥ మంచివారల చరితలు మహి పవిత్ర
కరము లాదర్శకములునై గాంచుకతన
పావనతగన్న రామాంబ భవ్యచరిత
శక్తికొలఁది రచించితి; సదయులార! 24
గీ॥ శ్రీయుమాపతి కరుణార్ద్రచిత్తుఁడగుచు
నాయురారోగ్య సుఖసంపదాళినిచ్చి
రామమాంబకుటుంబము నోముగాత!
కులము తామరతంపరై చెలఁగుగాత!

ఇట్లు, గ్రంథకర్త.



ఓమ్

శ్రీ సీతారామాభ్యాన్నమః.

# జానకీధవశతకము

ఉ॥ శ్రీ జనకాత్మజా విమలచిత్త సరోరుహ రాజహంస ! రా
రాజకిరీటరత్న రుచిరాజిత పాదపయోజయుగ్మ ! వి
భ్రాజిత నీలమేఘసమ రంజిత కోమలచారుదేహ ! రా
మా ! జితకోటి భావభవ ! మానితప్రాభవ ! జానకీధవా ! 1

ఉ॥ దానవగర్వభంజన ! విదారితశత్రువితాన ! సాధు సం
తానశ్రమాపహార ! వినుతప్రథనోజ్జ్వల శూర ! నీకు నా
మానసపద్మరాజము సమర్పణజేసెద భక్తియుక్తి; సు
జ్ఞానమొసంగి బ్రోవు; సుజనావన ! పావన ! జానకీధవా! 2

చం॥ ఇనకులదీప ! సజ్జనయభీష్ట ఫలప్రద ! దాసపోష ! పా
వనగుణధామ ! దైత్యకులభంజన ! తాపసవంద్య ! శ్రీపతీ !
వనజదళాయతాక్ష ! రఘువల్లభ ! నీపదదాస్యమిచ్చితీ
అని భవచింతనార్చి మదిరంజిలఁజేయుము; జానకీధవా! 3

ఉ॥ పావనమూర్తివంచు జనపాలుఁడవంచు, దయాళువంచు, దీ
నావనమూర్తివంచు, సురనాథశరణ్యుఁడవంచు, భక్త సం
భావన శీలివంచు విని ప్రాపుకుఁజేరినవాఁడఁ; ద్వద్దయా
శ్రీవిలసిల్ల నేలుము; హరీ ! రఘునాయక ! జానకీధవా ! 4

ఉ॥ చెన్నుగ నీదుపాద సరసీజమరందము నాని మన్మనం
బన్నమునీరుఁగ్రోలఁ బ్రియమందదు; తృప్తివహింప, దాత్మయం
దున్నిరతంబు నిల్పి పరితోషముఁ జెందఁగఁజేయు; దేవ ! వి
ద్వన్నుత ! లోకమోహన విభాసితసుందర ! జానకీధవా! 5

చం॥ అనయము తావకీన సుగుణావళి వర్ణనజేసి చెప్ప నే
వనజభవుండనో ? భుజగపాలుఁడనో ? విబుధేశ్వరుండనో?
మనుజుఁడ, నజ్ఞుడన్, జడుఁడ, మన్నన నీదయఁ గ్రమ్మరించి,నె
మ్మనము తవాభివర్ణన సమగ్రతఁదీర్పవె ! జానకీధవా ! 6

చం॥ సకలమునీవ ! నిన్ శ్రుతులు సర్వమయుండవటంచుఁజెప్పు; నె
న్నికనినుఁ బోల్పలేరెవరు, నీవ మహాత్ముఁడ! నీవదైవమా
దొకఁడవ శాశ్వతుండ; వికనొక్కని గోర దయాస్వరూప ! తా
వకశుభమూర్తిఁ గన్గొనెడి భాగ్యమొసంగవె! ; జానకీధవా! 7

ఉ॥ కామలతన్మదిన్ దునిమి, కాంతవరింపక బ్రహ్మచర్య పు
న్నీమముగల్గి, జ్ఞానమున నిస్తులుఁడై, వ్రతియై, నన్నున్ శుభ
స్వామునిఁజేసినట్టి బుధసత్తము వేములపాటి జానకీ
రామగుణాఢ్యు, నెమ్మదిఁదలంచెద భక్తిని; జానకీధవా! 8

ఉ॥ నిన్ననిశంబుగొల్చి స్తవనీయము తౌనవమాధురీ మహో
ద్యున్నత కావ్యరాజములు భూమిదిరంబుగ వెల్గఁజేసి; య
త్యున్నత స్వస్వరూప కలనోద్ధతి మించు కవీంద్ర బృందమున్
సన్నుతిచేసి, నీమహిమఁ జాటెద దిక్కులు; జానకీధవా ! 9

చం॥ తెలియనివాఁడ, కల్మషుఁడ, దీనుఁడ, హీనుఁడ, నిట్లు చంపకో
త్పలనవచారు పద్య సుమదామము నీదగు కంబుకంఠమం
దలరఁగజేసి దివ్యపదమందఁగ నీదరిఁ జేరఁగాంచితిన్
వలదని త్రోయకయ్య ! రఘువంశసుధాకర ! జానకీధవా ! 10

చం॥ చదువఁగలేదు శాస్త్రములు, సజ్జనసంగతి మెల్గలేదు, స
ద్విధులొనరింపలేదు, సువివేకములేదు, భవత్పదంబులే
నెదఁ బదిలంబుగా నిలిపి యీ శతకంబు రచింతు; శాశ్వత
ప్రదముగవెల్గు నియ్యది భవద్గుణవర్ణన; జానకీధవా! 11

చం॥ కలను సమస్తవస్తువులఁ గాంచినభంగిఁ బ్రపంచమెల్లఁ గే
వల మనృతంబటంచుఁ, దమపాదములే గతియంచునమ్మి; యా
కులతనడంచి, చిత్తమునకుంఠిత బ్రహ్మమునందు నిల్పి నీ
విలసితమూర్తిఁ గన్గొనఁగ వేమరునెంచెద; జానకీధవా! 12

ఉ॥ ఏ నపరాధముల్ గణనకెక్కుడుగా నొనరించి, నీపద
ధ్యానము జేసి యీగుటకు నల్లనవచ్చితి; గానవేని నీ
గానము జేయు భక్తులికఁ గాంచుఫలంబదియేది? యేదినీ
మానిత పావనత్వమహిమంబు? రఘూత్తమ! జానకీధవా! 13

చం॥ కలుముల నీనులక్ష్మి తమకంబునఁ బాదములొత్త, నీళయు
న్జెలువ, ధరాపురంధ్రియును నిచ్చలుభక్తిని గొల్చుచుండ, ది
వ్యులునుతిసేయ, బాల్కడలిఁ బొల్పుగ శేషఫణీంద్రతల్పమం
దలరుచునుండు తావకశుభాకృతిఁ జూపుము; జానకీధవా! 14

చం॥ ధనికుఁడు నిర్ధనుండగును తత్వవిదుండు విమూఢచిత్తుఁ డౌ
తనసుఖమెల్లఁ గష్టమగుఁ, దన్ను గణింపరెవారు, రామ! నీ
ఘనదయ లేనివారలకుఁ గష్టపుమన్గడయౌనుజూ, కృపా
వనధి! భవద్దయన్ సకలభాగ్యములబ్బును; జానకీధవా! 15

ఉ॥ దండడి కష్టజాలములఁ దార్కొనఁజేసిన, నూతముంచినన్
మ్రందగ నగ్గివేసినను, మ్రాన్పడఁ గ్రూరమృగాళిఁ దార్చినన్
వందుర, కోపమూన, తగవాయనిదూరను నిన్ను! నీపద
ద్వంద్వములందుభక్తి మదిఁబాపినవోర్వను; జానకీధవా. 16

ఉ॥ వేదములెల్ల నేర్చుటయు, విశ్రుతశాస్త్రములెల్ల జూచుటల్
బోధ లనేకముల్ వినుట, పూర్ణసుకర్మము లాచరించుటల్
నీదగుతత్వముఁ దెలిసినీపయి భ్రాంతిని నిన్నె జేరనౌ;
యేదియునేల? నీస్మరణయే సకలమ్మిదు; జానకీధవా. 17

చం॥ పలుమరు నీకథల్ వినుచుఁ, బాడుచు, వ్రాయుచుఁ గీర్తి సేయుచున్
సలలిత యుష్మదంఘ్రి జలజంబులు కన్నులఁ గాంచుచున్, భవ
ద్విలసిత నామమంత్రము జపించుచు, నీపరిచర్య సేయుచున్
నిలచెద నిశ్చలాకృతిని, నీపదసన్నిధి; జానకీధవా! 18

ఉ॥ శీతమయూఖ, శీతనగ, క్షీరనిధీ, సురధేను, మౌక్తికో,
పేతభవత్సుకీర్తిదివిఁ బృథ్విఁ జెలంగ, దినేశ, యోషధీ
శా తత కాంతులుబ్బణఁగె; నో! త్రిగుణాత్మతఁ దోచు నాపరం
జ్యోతివి; నీదు శోభకెన యుండునె యెందును? జానకీధవా! 19

ఉ॥ అక్షరమౌ వికుంఠ పదమందిసుఖింప భవద్విశుద్ధ నా
మాక్షర మంత్రరాజమకదా! సుజనాళికిఁ బ్రాపు; దేవతా
ధ్యక్ష! సుధర్మపక్ష! విబుధావనదీక్ష! త్రిలోకరక్ష! నీ
పక్షమువాఁడ; నీదయకుఁ బాత్రుఁడ నేలుము; జానకీధవా! 20

చం॥ సరసులు రామమంత్ర కలశార్ణవమున్ మథియించి, సారమై
బరఁగిన నిన్ను నాత్మల శుభస్థితిఁ బొంది; రగమ్యమైన నీ
శ్వర! భవదీయతత్త్వ మనిశంబును కన్నులఁ గానఁ జేసి, సం
సరణ మహాబ్ధి నిస్తరణ సల్పవె భూధవ! జానకీధవా! 21

చం॥ నరవర సిద్ధసాధ్య సురనాగ సురద్విష ముఖ్యసంఘముల్
నిరతము జేరి యెవ్వని వినిర్మల పాదపయోజ యుగ్మముల్
శిరములఁ దాల్చి గొల్తు?; రఘశీర్ణము లెవ్వని నామమంత్రముల్?
సరసిజనాభ! యట్టి నిను సన్నుతిచేసెద; జానకీధవా!

చం॥ హరియనఁగా, హరుండనఁగ, నబ్జభవుండన, వాసవుండనా,
బరగిన వాఁడ వీ వొకఁడ; పద్మభవాండము నిండి వెల్గు నీ
గురుతరమూర్తి యొండె యిటు కోట్లకొలంది యభిఖ్యఁ బొంది యె
వ్వరెటుభజించినం దగినభంగి ఫలంబిడు; జానకీధవా!

ఉ॥ హెచ్చుగ నీపదాంబుజము, లెంతయుఁ దప్పక గొల్చువారికిన్
వచ్చును భుక్తి ముక్తియును, వచ్చు జగత్పరిపాలకత్వమున్
వచ్చు నభీష్ట సంపదలు, వైభవముల్, తుదిలేని కీర్తియుఙ్
మెచ్చి యనిష్టహేతువుల మేకొన నేటికి? జానకీధవా!

ఉ॥ ప్రాసలదారమట్లు జగముల్ తగనీయెడ, నీవు వానిలో
భాసిలుచుంట జీవులకు బాగొనరించిన సంతసింతు; వా
యాసము పుట్టఁజేసినను నాగ్రహమూనుదు; జీవకోటికిన్
జేసిన సేవ నీకొరకె చేసినయట్లగు జానకీధవా! 25

ఉ॥ నీసములెవ్వరంచు నిది నేనను పాటయగాదు, మున్ను నీ
దాసి నిషాది, గౌతమునిదార, గుహుండు, జటాయుపక్షి, వి
శ్వాసముమీరఁ జెప్పి రది సర్వదిగంతర వ్యాప్తమయ్యె; నా
భాసము సేయబోకు; మినవంశ ప్రదీపక! జానకిధవా! 26

చం॥ అడిగెదనిన్ను కోరిన పదార్థములిమ్మని; జాలిబుట్టఁగా
నుడివెద వేగ నామొఱవినుండని; చిత్తము కందళింపఁగాఁ
దడవెదభక్తి నీగుణకదంబము గాంతు; భవచ్ఛుభాంగమున్
గొడవలు వేయునేల? నినుఁగొల్చి తరించెద; జానకీధవా! 27

ఉ॥ ఓరఘువీర! నీదు కరుణోదధి యెవ్వనిమీద బారునో
వారలకెల్ల సంపదలపారముగా దయచేసి, జ్ఞానమున్
గూరిచి, సర్వదుర్భ్రమలు గూలిచి, నిన్గొలువంగఁ జేసి, సం
సారమహాబ్ధి నిస్తరణ సల్పెదు వింతగ; జానకీధవా! 28

చం॥ దివిజనగంబు, దేవతల ధేనువు, కోరిన కోర్కెలిచ్చు; న
య్యవి ఘనమంచుఁ జెప్పెదరహో? రఘునాయక? నిన్నుదల్చినన్
అవిరళ సౌఖ్యసంపదలనంది సుఖింతురు కోర్కెలేక; ని
య్యవనిని నీదు దాసులనఘా! జితదానవ! జానకీధవా! 29

ఉ॥ మైపులకింప, నింద్రియసమాజము శాంతివహింప, బాష్పముల్
తేపకురాల, చిత్తము చలి పక గాఢ సమాధిఁగూడ, సం
తాపముదూల, నీదు భవతారకమంత్ర జపంబుసేయఁగా
శ్రీపతి! భక్తి నిష్ఠ దయసేయుము వైశమ; జానకీధవా! 42

చం॥ ఎగుభుజముల్, వెడందయుర, మెక్కుడుపీనులు, దీర్ఘబాహువుల్
నగుమొగమున్, విశాలనయనంబులు, రాజిత పాదపద్మముల్
మగఁటిమి, సుందరంబు మునిమండన వీక్షణ భోగ్యమైన యిం
పగు భవదీయమూర్తి, హృదయంబున నిల్పుము; జానకీధవా! 43

ఉ॥ నీదగుశాంతి,దాంతి, శుచి, నిర్మలవృత్తము, శౌర్య, సత్యమున్
నీదయ, త్యాగశీలము, ననిందితధర్మము, కార్యదీక్ష, స
ద్బోధ, ప్రభావముల్ గనిన దుర్లభదర్శనుఁడంచుఁజూడ స
మ్మోదముఁగొల్పు నట్టి కృతపుణ్యునిఁ జేయుము;జానకీధవా 44

ఉ॥ తమ్ములు ముప్వురుం గుణనిధాను, లుదారులు, సూర్యవంశ ర
త్నమ్ములు, నీవు ధీనిధివి, తత్త్వవిదుఁడవు, శౌర్యదైర్య స
త్వమ్ముల కాటపట్టవు; సదాన్యచరిత్ర, సతీపవిత్ర, సీ
తమ్మ త్వదీయపత్ని, సుకృతంబన నీయదె; జానకీ॥ . 45

చం॥ చదువఁగనేల వ్యర్థముగ శాస్త్రములెన్నియొ, రామ!నీకథల్
చదివిన, వ్రాసినన్, వినిన సద్గతిచేకురునందు, నిందు సం
పదల, సుఖాయురున్నతుల వర్ధిలుచుందురు; జీవితంబునం,
దొదవెడు సత్ఫలం బిదియ; యుర్వి బుధాళికి, జానకీ॥ 46

ఉ॥ తన్నెవరైన కినకను నదల్చిన బిడ్డడు తల్లివంకకున్
క్రన్ననఁబారి, భీతివిడి గంతులువెట్టుచు నాడు, నట్లె యా
పన్నుఁడు దిక్కు నీవెయని భావన జేసి, భయంబుఁద్రోసి, ని
త్యోన్నతి నీసముక్షమున నుండుఁ జెలంగుచు; జానకీ॥ 47

ఉ॥ ఆకలి, దప్పి, నిద్ర, మృతి, వ్యాధులు, జన్మ, జరాది కష్టముల్
సోఁకక, చింత, మోదముల, జోలియెఱుఁగక, తృష్ణలేక, ని
ర్వ్యాకులపాటు తోడ హృదయాంతరవర్తిని నిన్ను నెప్పుడున్
జోక భజించునట్టి గతి సూపుము; కేశవ! జానకీ॥ 48

ఉ॥ తాపసు యజ్ఞరక్షణ ముఖంబునఁ జేసి, యహల్యశాపమున్
బాపి, మహేశు విల్లువిఱి, పన్నుగ సీతవరించి, భార్గవో
ద్దీపిత శక్తిఁ గొంచు, వినుతింప నయోధ్యకు నల్లవచ్చి, మేల్
జూపుల పౌరసంతతిని జూడవె; వేడుక జానకీ॥ 49

ఉ॥ తేజసమార యత్రిముని దివ్యప్రబోధముఁ గాంచి, యాభర
ద్వాజుని, నాయగస్త్య శరభంగు, సుతీక్ష్ణు మహాతపోధనున్
బూజలొనర్చి, నీసుగుణముల్ కులశీలమెఱుంగఁ జేసి, ని
ర్వ్యాజకృపాపరత్వమున భాసిలితెంతయు, జానకీ॥ 50

ఉ॥ "ఎవ్వఁడయోధ్యరాజ్య రమనేలఁగ దక్షుఁడు నీవగాక ? నా
నెవ్వగ బాప, నెల్లధరణిన్ గొను; వీటికిరమ్ము ! రామ ! నీ
కివ్వనవాస కష్టమదియే" లని కుయ్యిడు లక్ష్మణాగ్రజున్
మవ్వముమీరఁ బావలిడి మన్నితి వొప్పఁగ; జానకీధవా! 51

ఉ॥ అంగనయైన యాశబరి యర్మిలియిచ్చు ఫలంబులాని, యు
ప్పొంగుచు మోక్షమిచ్చితివి; ముఖ్యము భక్తియగాని నీకు నే
భంగులు మెప్పుసేయవు; కృపాజలధీ ! యికనేటిశంక ? యీ
వెంగలిఁ బ్రోవుమీవడిగ, వేరొనరింపక; జానకీధవా! 52

చం॥ శరణని యావిభీషణుఁడు సాగిలి మ్రొక్కిన వైరితమ్ముఁడం,
చరయక వేగమే యభయహస్తమునిచ్చితి; రాజ్యమిచ్చి; యీ
సరణినెవండు బ్రోవఁగలశక్తు ? డనిర్వచనీయ ప్రేమ సా
గరుఁడెవఁడింక ? నిన్గొలువఁగామనసయ్యెడు; జానకీధవా ! 53

చం॥ కడలికిఁ గట్టఁగట్టి, బలగంబుగఁ గోతులఁ జేతవట్టి, యే
పడగఁగలంకఁజుట్టి, భయదాహవకేళిని రాక్షసాళిఁ గ్రి
ద్దపడఁదెగటార్చి, సీతఁగొని వైభవమొప్పఁగఁ బుష్పకంబుపై
వడిగనయోధ్యకేగితి; సుపర్వులుమెచ్చఁగ, జానకీధవా! 54

చం॥ అనుజులుగొల్వ,భూమిసుతయంకమునన్ జెలువొంద,వాయునం
దనుఁడు పదంబుఁబట్ట, సురదానవ, వానరమర్త్యసంఘముల్
మునుకొనికీర్తిసేయ, గురుముఖ్య తపస్వులు స్వస్తిచెప్ప, కాం
చనమణి పీఠిరాజసముగ్రాల నయోధ్యను గొల్వుఁదీరు, నీ
ఘనతర సుందరాకృతినిఁ గన్నులసూపుము; జానకీ॥ 55

ఉ॥ నీకథనవ్య మాధురిమనిండఁగవ్రాసి, వెలుంగఁజేసి, వా
ల్మీకి మహానుభావుఁడయిమించె; భవత్పదపంకజంబు లెం
తేకుతుకంబునన్ గడిగి నీపదమందెగుహుండు; హీనుఁడౌ
గాక త్వదీయదాస్యమున గాంచును భద్రము; జానకీ॥ 56

ఉ॥ కన్నుల వత్తులుంచుక జగంబు సమస్తముజూడఁదోఁచె, నో
సన్నుతమూర్తి! నీవొకఁడ చక్కని దైవము; నార్తిఁబాపియు
ద్యున్నతినిచ్చుదైవము, మహోన్నత లోకమొసంగుదైవమై,
యెన్నిక కెక్కితంచు భజియించితి గాదొర! జానకీ॥ 57

చం॥ అసురులదృంపవా? యరుల నాజినడంపవ? భీతిఁగొన్న తా
పసులను బెంపవా? సురలబాధలుదీర్పవ? మోదమంద నీ
వసుధభరింపవా? యరసిభక్తులఁ బ్రోవవ? యేమివింతదు
ర్వ్యసనముఁగాల్చి నాభయముబాపి భరింపఁగ; జాన॥ 58

చం॥ ఘనతర రాజ్యభోగములు గావని భూమిజఁగూడి, కాననం
బునవసియించి, దానవులమోసములంబడి, సీతఁబాసి, త
మ్ముని పెనుమూర్ఛఁజూచి, వగఁబొందుటలెల్లను సజ్జనాళిఁగా
వనెగద; కష్టమేమి ననుబాలనసేయఁగ? జాన॥ 59

చం॥ ననుఁగృపనేలు టెంతపని నాజనకా! జలమందు వేదముల్
గొనకొని తెచ్చుటో? జలధిఁగొండను మోయుటొ? భూమి నెత్తుటో
దనుజకుమారుఁ బ్రోచుటయొ? దానవుఁ ద్రొక్కుటొ? రాజలోకముల్
దునుముటొ? రావణాదులను ద్రుంచుటొ? యెంచుము; జాన॥60

ఉ॥ గోవును వెంబడించి చను కోడెవిధంబున భక్తసంతతిన్
గావఁగ వెంబడింతువని గ్రంథములెల్ల వచించు; నన్నృతం
బావచనంబు, సత్యమనియన్న! భవార్ధి నిమగ్నునన్నుఁ ద్వ
త్పావన పాదభక్తునిఁ గృపన్ గనవేటికి? జానకీధవా! 61

ఉ॥ చాలును జాలు; సంసృతివిచారము, సైపఁగఁజాల; దుఃఖసం
శీలుఁడనైతి, నేసుఖముఁ జెందఁగనైతి; నిదేటికాపురం?
బాలును, బిడ్డలాప్తులు, గృహంబులు, సంపద, లెల్లమిథ్య; నా
కేలవృథా భ్రమన్ గొలిపి యిందులద్రోసితి? జానకీధవా! 62

ఉ॥ చెన్నటినొచుఁ బాపమును జేసితి నేననిశంబు; వ్యాధులన్
ఖిన్నుఁడనైతి; నాపదలు నిర్భరమయ్యె; దరిద్రతాపసం
ఛన్నుఁడనైతి; రామయని సాగిలిమ్రొక్కుచునుంటిఁ; దండ్రి నీ
కన్నను దిక్కులేదు; ననుగావఁదలంపవె! జానకీధవా! 63

ఉ॥ మీరినవాఁడ నీపలుకు, మీరిచరించితి శాస్త్రపద్ధతుల్
మీరితిఁ దల్లిదండ్రులను మిక్కిలిదూరితి సూరివర్యులన్,
నేరనివాఁడ, మూఢుఁడను, నిన్నెమనంబున నిల్పియుంటి;న
న్నారసి బ్రోవుమీ! శరణటంచును మ్రొక్కితి; జానకీధవా! 64

చ॥ కరములు మోడ్చి నేరములఁ గావుప్రభూ! యని మొఱవెట్టు నన్
సరగున నెత్తి, యూరటయొసంగఁగఁ బల్కుభరింపవేమి? సుం
దరవదనేందు మండలము దర్శనమీయవదేమి? యాపదో
ద్ధరబిరుదాంకహస్తమును దాచెదవేటికి? జాన॥ 65

చం॥ ఒకపరి నిన్నుఁ జేరి ననునోసుగుణోత్తమ! కావుమందు; వే
రొకపరి కావరామి నినునొత్తిలిదూరుదు; నాగ్రహింతు; నిం
కొకపరి ఖేదమందెద; మరొక్కపుడార్తుల రక్షసేయు తా
వకబిరుదంబుఁగాంచి మది బ్రార్థనసేయుదు; జాన॥ 66

చం॥ కసరి భయంబుఁజూపి నోడికంబుగఁ జెప్పి, సుఖంబుగూర్చి మా
నసమున కెక్కనడ్పి, సుగుణంబులఁజాటి, శ్రమఁబుబెట్టి, వె
క్కసపడితిట్టి, ధూర్తయగు కామినినొంచి, గృహస్థధర్మ మిం
పెసగఁ నొనర్చు భర్తగతినేలుము నన్నును; జాన॥ 67

చం॥ ఎవఁడని యెంచితో నను జనేశ్వర! పుత్రుఁడనీకు! నీవు తం
డ్రివిగదనాకు? పుత్రులను బ్రేమభరింపరె తండ్రులెయ్యెడన్
దవిలి కుమారులేమడిగినన్ వడిగూర్పరె? గారవింపరే?
భువినివిక్రొత్తలే? కృపనుబూనుము నాపయి; జాన॥ 68

ఉ॥ చేసితి వెన్నిజన్మములొ, చేసితి వెన్నియొ భూరిదానముల్
దాసుల నెందరెందరినొ తప్పక బ్రోచితి; వాంఛితార్థముల్
వీసరబోక నర్థులకు వేలిడి; తిట్టిదయాపరుండవో;
దీసమయంబునన్ మనవి యేల గ్రహింపవు? జాన॥ 69

ఉ॥ వేడినవారిఁ గావమని, భీతిలువారలఁ బ్రోవమిన్ ఘనం
బాడినవారి నేలమిని, యాదరమున్ననుఁ గూడువారలన్
గూడఁగ నీయమిన్ మదికి గొప్పగఁ దోచెనొ? మెచ్చువచ్చునో?
కోడిగమెన్నదో? నతులకున్ మదిమెచ్చవొ జాన॥ 70

ఉ॥ రావది యేమి వేడినను? రాజసమా! గరువంబ! కోపమా?
దైవమవీవకావ? నినుఁదల్చినవారి భరింపలేవ? నీ
తావున కేను రాఁదగన? ధర్మము దప్పనటందువా? జగ
జ్జీవనమూర్తిరమ్ము! ననుచేరి కనుంగొను; జానకీధవా॥ 71

ఉ॥ నోరికొలందులాడితినిన్, మహనీయ! కృపారసాబ్ధి! సీ
తారమణా! మదీయదురితంబది యెట్టులదీరు?; కష్టముల్
గూరఁగ భక్తులేమనుచు, గుయ్యిడినన్ దరహాసచంద్రికల్
గారఁగ జేరఁదీర్తు; వపరాధములెంచక; జానకీధవా! 72

చ॥ కలఁగనిమేలుగాంచినటు గ్రక్కున నేఁగె మదీయజీవితం
బిలఁబురుషార్థగామినయి యీనరజన్మము సార్థకంబుగా
మెలఁగెదరుంగ; చెందిన యమేయభవవ్యథయొండు దక్క, నా
కలవడినట్టి భోగమిదె గా! వరదాయక! జానకీధవా!

ఉ॥ ఆటలఁబైని బాల్యమున నర్మిలిమిక్కిలి; యౌవనంబునం
బోటులఁబైని నగ్గలము మోహము; ముప్పున గాపురంపు నా
రాటము హెచ్చు; నెప్పుడు విరాగమునం, బరతత్త్వచింతలో
నాటు? భవంబు పాయు నెటు? నారదసన్నుత! జానకీధవా! 74

చ॥ ముదిమి చెలంగి, యంగముల పొల్పు నశించి, కృశించి, సారమున్
వదలి, శరీరరక్షణము భారముగాఁగను; అన్నపానముల్
మదికరుచించి యంత్యదశఁ బ్రాణము వీడుచునుండినన్ నరుం,
డెదఁ బెనఁగొన్న యాసన శయింపదు; చిత్రము! జానకీధవా!

ఉ॥ కాలము మారు, సర్వమును కాలగతిన్ బరిణామమందు; జీ
వాళికి నెందు నేదియును నస్థిరమే! యిటులయ్యు నిస్సిరో!
బాళిని నెందుకెందులకొ పాతరలాడుచు, రిత్తకోర్కులన్
కాలముఁ బుత్తు; మాశలను గాల్చి సుఖింపక; జానకీధవా॥ 76

ఉ॥ ప్రాణము పోవువేళలను బ్రాణసమానులఁ దల్లిదండ్రులన్
సూనుల, బంధులన్, సతిని, శోకముతో విడనాఁడు చావఁగాఁ
దాను సహింపకున్న మృతిదప్పునె? నెయ్యుర నిల్వఁజాలునే?
కానవిరాగియైమనుట కర్జము జ్ఞానికి, జానకీధవా॥ 7

చం॥ ఘనమగు తత్వశాస్త్రములుగాంచిన, భాగవతాదిగ్రంథముల్
గనిన, మహాప్రబంధములుగన్నను, భాష్యములెల్లఁజూచినన్
తను, జగదంతరాత్మవగు దైవమొకండుగఁదోచు; నాత్మయం
దును రమియించుయోగులు నినుం మదిగాంతురు జానకీధవా! 78

ఉ॥ ప్రాణముకంటెఁ బ్రీతియగు వస్తువులేదిల; యట్టిప్రాణమే
ప్రాణులసర్వదేహముల బంధుగమై వెలుగొందు; నేలకో
తానుపరుండటంచుఁ గలతన్ విహరింతురు, చంపఁబోదు, ర
జ్ఞానముకాదె; యీయెరుక నామదినిల్పుము; జానకీధవా!

ఉ॥ అన్నియు నున్న, నీవొకఁడ వచ్యుతమూర్తివి, నాదుచిత్తమున్
సన్నుతయుష్మదంఘ్రి జలజాతములందలి భక్తినిల్పు; నా
కన్నులముందు నిల్వు; మిదిగాక వివేకి యికేమికోరు? సం
పన్నుతగోరులుబ్ధుఁడు; కృపన్ దరిఁజేర్పవె! జానకీధవా! 80

ఉ॥ పెక్కగునామరూపములఁ బేర్కొనఁజాలిన లోకజాలముల్
నిక్కము; మాయచేత మునునిర్మితమయ్యె; పసిండియొక్కఁడే
చక్క ననేకవస్తువుల జాడఁగనంబడురీతి, నీవ! పెం
పెక్క జగంబుభాతి గనుపింతువు; రాఘవ! జానకీధవా!॥ 81

చం॥ తడియదునీటి కెండలకుఁ దాపమునొందదు; వాయుతాకునన్
బడలదు; వహ్నికిన్ జెడదు; బాణములంట; వనాదిసిద్ధమౌ;
కడల, నభస్థలిన్, భువి నఖండముగా వెలుగొందు; నిత్యమై
యడరెడునాత్మ లోఁగననియజ్ఞుఁడఁ, గావుమ; జాన॥ 82

చం॥ పొలిసెడుదేహమున్ నిలుపఁబోలదు; నాశములేనియాత్మకున్
పొలియుటకల్ల; దింక వగబూనుటవ్యర్థమెకా శరీరికిన్
తలకరు తత్వవేత్తలు, సుధా సదృశంబగు నిత్యలోకముల్
గలుగ భజింత్రునిన్ను తమకంబున నెమ్మది; జాన॥ 83

ఉ॥ తీరుగపండి, పండుతుది(దెస్సి భువింబడురీతి యాయువున్
దీర(గనే కడంబడునో దేహము; జీవితమెంచ( జంచలం
బౌర! మహాప్రియంబునను, నస్థిరకాయము నట్లెయుంచుకో(
గోరెద; మేటిబుద్ధి? నిను(గొల్చిన మోక్షము; జాన॥ 84

చ॥ అలికిడి(గన్న సంగముల నల్లనలో(గొను కూర్మపద్ధతిన్
పలువిషయాళిపై నెగసి పారుచ నింద్రియముల్ గుదించి, చం
చలగతి(బాపి, శాంతి(దను సర్వమయు(డుగ( జింతసేయు జ్ఞా
నులు తనులోనివాని(గ నినుంగను(గొందురు; జాన॥ 85

చం॥ లయ,హఠ, రాజయోగముల, రాజస,తామస, సాత్వికంబులన్
లయమొనరించి, నిన్నెమదిలక్ష్యముగానిడి; ధ్యాననిష్ఠచే(
బ్రియమగు చిత్సుఖంబుగని విశ్వముమానినవానికెల్ల సం
దియములుదీరి, శాశ్వతగతిన్ జరియించును; జాన॥ 86

చం॥ తనువుగృహంబునందు పరతత్వవిచారము పేరిరత్నమున్,
గొనుటకు షడ్వికారము లకుంఠితశత్రులమాడ్కి(బొంచి, గొ
బ్బున తెరువాటుకొట్టెడిని; బుద్ధివశిత్వముమాన్చి, శమున్ గం
జసిబరిమార్చి, నన్ శుభగశీలుని(జేయుము; జాన॥ 87

చం॥ జలజదళంబుపై జలముచాడ్పున సంసృతిక్లేశమంటకే,
మెల(గెడి యోగనిష్ఠ నెలమిన్ దయసేయుము; త్రాడు పాముగా
వెలసినమాడ్కి భ్రాంతియుత విశ్వము లేనిదిగా నెఱింగి, ని
శ్చలగతి(బొంద బుద్ధినువిచారము నింపుము; జాన॥ 88

చం॥ చెలువుగ, దంతుగేహముల(జేసి, యటన్ విహరించి, యంతలో
పలికి (గసి చులూతగతి, బాగుగ సర్వప్రపంచమీవునూర్ణ
వెలువడ(జేసి, రక్షయిడి, వెండి నశింప(గ(జేతు; విట్టినిన్
దెలియుదునే? భవాబ్ధినిమునింగినయల్పు(డ; జాన॥ 89

చం॥ సలిపెడుకర్మలెల్లఁ గలుషంబునఁ బ్రుంగినవౌను; వానిచే
బలువగుమోహపాశములఁ బాపఁదలంచుట, జీకుచేయి తా
వలముగ వార్ధినీదు సదుపాయము సేయుమి; నిన్నెఱుంగు స
త్ఫల సువిచారమే, భవవిపాటనమార్గము; జాన॥ 90

ఉ॥ జీవము బాయుచోఁ దలఁపుచిత్తము నేగతిహత్తియుండునో
యావిధిఁ జేతనాళి భవమందెద; రక్కట! నాదు డెందమో?
కావరపంకమగ్న; మెటుగల్గు భవత్స్మృతి? కాననిప్పుడే
కేవలభక్తి నిన్దలఁచి కీర్తివహించెద; జాన॥ 91

ఉ॥ ఒండుతలంపులేక ననునొక్కని వే శరణంబుఁజెంది, యె
వ్వండు సమస్తధర్మములఁ బాసి భజించుని, వానిసేనము
కుండుగ సల్పిపాపములకున్; భరియించెదనంచుఁ బల్కవే?
దండిగ నీవటుండ నెదితక్కువయేరికి? జాన॥ 92

చం॥ పడగనువిప్పి చిఱ్ఱనుచుఁ బైబడి ఱక్కుమహాభుజంగమున్
ఎడదయెలర్పు నాగసరి మించుకసాడి వశీకరించున;
ట్లుడుగక రామతారక రసోర్మ్ములఁగామ దవాగ్నినార్చి, పెం
పడర మనంబునిన్నుఁ బ్రియమందఁగఁ జేర్చెద; జాన॥ 93

చం॥ గురుపదమర్థవంతముగఁ గ్రుమ్మరు దేశికు నాశ్రయించి, స
త్కరుణ నతండు సెప్పు శుభదంబగు విద్యల నేర్చి, సద్గుణో
త్కరముఁ జెలంగి, నొడ్లకు హితంబొనరించుచు, శాంతచిత్తులై
యురుదుగ నిన్దలంచు విమలాత్ములు ధన్యులు; జాన॥ 94

ఉ॥ నేరిమిఁ బూనకే చవుటినేలను విత్తిన బీజమట్లు, హం
కారులఁజెంది విద్యయు, ధనంబును, శౌర్యములౌటెగాక, ని
ష్కారణ వైరమూలమగు; సజ్జనుఁడయ్యవిసారచిత్తులౌ
వారినెఱింగి నీవలెఁ; బ్రపంచహితార్థము; జాన॥ 95

చం॥ కలిగెడు మంచిచెడ్డలను గానకపామరు, డింద్రియంబులే
వలనికిఁ ద్రిప్పినన్ జనియవశ్యము గూలువిపత్పరంపరన్;
మెలఁకువనవ్వి ముందెగని మేలుపథంబున నేగి, సౌఖ్యముం
దలరు వివేకి; యిర్వురకు నంతరమింతగు; జాన॥ 96

చం॥ కలిసమయప్రవాహము సుకర్మ ప్రదీప్త మహాఘ జాలమున్
దలముగముంచె; సజ్జనమనస్సరసీరుహముల్, దురుద్యమా
నలమునఁ గ్రాగె: తుచ్ఛనవనాగర కాఖ్యమహాగ్రహంబు ని
ర్మలకుల శీలదిగ్గజములాగె;మహాధ్వికి జాన॥ 97

చం॥ ఇలవిపరీతవాదములు హెచ్చె; జడాత్ములు శంకలజ్ఞతన్
సలిపెడి కార్యసంతతికి సన్నుతిమించె; యథేచ్ఛవర్తనం
బలరి స్వధర్మమైబరగె; యార్యులమాటలు పొల్లులయ్యె; నే
వలమెయి దాచుకొంటి కనవా? కలిధర్మము; జాన॥ 98

ఉ॥ జంకకశాస్త్రరోధముగఁ జాలవచింపఁగవచ్చు, మాన్యులన్
గొంకకతిట్టవచ్చు, తనగొప్పకు హీనుల గొల్వవచ్చు, ని
శ్శంక ననేక ఘోరములు సల్పఁగవచ్చు; యథేచ్ఛనేమి యా
తంకము? దుష్టశిక్షణ విధాయకులెవ్వరు? జాన॥ 99

ఉ॥ వరసుఖమెల్లమాసె; విభవంబులు గోల్పడె; నుజ్వలత్వమున్
దఱగె; ప్రతిష్ఠవీడె; ఘనధర్మమునూడె; ప్రశాంతియారె; దె
ప్పరమునుమీరె; కష్టములువర్ధిలె భారతరాజ్యలక్ష్మికి
కొరఁతలుదీర్చి కావగదె ! కోరికలీగదె! జాన॥ 100

ఉ॥ జ్ఞానులఁ, దాపసోత్తముల, సత్యపటిష్ఠుల, శూరవర్యులన్
సూనృతవాదులన్, సుగుణశోభితులన్, సతులన్, మహాత్ములన్,
దానగుణాఢ్యులన్, విమలధర్ములఁగాంచిన భారతాంబ సం
తానము నేడుగాంచి, పరితాపముఁదీర్పవె! జానకీ॥ 101

ఉ॥ రొక్కముగూర్చినన్ గలుగు లోకములో ఘనమైన కీర్తి; వాఁ
డొక్కఁడెమేటి;వాఁడెసుగుణోత్తముఁ,డాతఁడెపూజ్యుఁ,డాతఁడే,
యెక్కువనేర్పువాఁడు, ప్రజకెక్కినవాఁడు, సమర్థుఁ, డెన్న నిం
కొక్కడి శక్తియోగ్యతలు? నెక్కడిధర్మము; జానకీ॥ 102

చం॥ కడచె యుగంబులెన్నిగను; యొకప్పుడుమానవ్యులఁగష్టపెట్టి, యే
న్వడుభువి కీర్తిఁజెందె? నెడఁబొందని ప్రాభవమొందె? మున్ను: తా
చెడని పదంబుఁజెందఁ, బుధచిత్తములెప్పుడుఁ గందకుండ, మే
లిడి యరయంగనౌ; దయవహించి జగంబున; జానకీ॥ 103

చం॥ ప్రజలకు మేలొనర్చి జనపాలురు, రాజులశ్రేయమెంచి యా
ప్రజలు, పరస్పరంబు నెడఁబాయని మైత్రిఁజెలంగ, ధర్మమే
విజయముగాంచ, దుష్కృతము వీడ్వడ, శాంతిఁగనంగ, సంపదల్
సుజనులు వృద్ధిపొంద దయఁజూడుము; మాధవ! జానకీ॥ 104

చం॥ హరి! పరమేశ! యీశ్వర! దయాపర! పాహివిపన్నరక్షణా!
సుర, గరు, డోరగ, ప్రముఖసన్నుతపవిత్రచరిత్ర! మానవే
శ్వర! కులధర్మముల్ నిలిపి, భవ్యమతంబులఁ బ్రోచి, న్యాయమున్
బొరయఁగ ధాత్రి నేలుము; విభో; సుజనావన! జానకీధవా॥ 105

చం॥ దనుజులు దుర్మదాంధులుగ ధాత్రిజనించి, ప్రధానధర్మమున్
మునుమిడి ద్రుంచియున్నతినిఁబొందిరి; నీవు సురాళిగూడి, యు
ర్విని సుజనాళిగాఁ బోడమి శ్రేయముబెంచి, దురాత్ములన్ హరిం
పను, బుధులన్ భరింపఁ, బ్రభు పట్టముగట్టుము; జానకీ॥ 106

ఉ॥ శ్రీయుత యారువేల కులశ్రేష్ఠుఁడ, వేంకటనామ పూర్వనా
రాయణ పావనాహ్వయుఁడ; లక్ష్మమ, వేంకటరామ శర్మయన్
ధీయుతు లస్మదీయ జననీజనకుల్, భవదంకితంబుగా
నాయతభక్తి నీశతక మర్పణసేసితి, గూర్మిగొంచు వా
ప్యాయముగా వికుంఠ సుఖవాసము గూర్పుము; జానకీ॥ 107

చం॥ రవికుల నాథ! ధీమహిత! రామ! బుధస్తుత! మంగళంబిదే
సవినయబుద్ధినిత్తుఁ గొని శాశ్వతలోకము నాకునిమ్ము! సం
భవ! ధృతినాశముల్ గొలుపు మంగళమూర్తికి నీకుమంగళం
బెవడిడువాడు ధన్యుఁడుగదే! కరుణామయ! జానకీధవా॥ 108

శ్రీజానకీధవశతకము సంపూర్ణము.

ఓమ్‌తత్సత్.



ఓమ్

# శ్రీ వేంకటేశ శతకము



## ఆ. వె. గీతములు.

1 శ్రీనివాస! భక్త చిత్తాంబురుహవాస! । కామితార్థ ఫలద! కావుమమ్మ!
నీవ దిక్కనుచు నెఱనమ్మి యున్నాడ! । విమతగుణ వినాశ! వేంకటేశ! ॥

2 సుకవులెల్ల నిన్ను సుధరయొల్కు పల్కుల । వినుతిఁజేసిపొందఁ గనిరికోర్కె;
లేను భక్తిఁబల్కి యీప్సితంబులఁ గొందు; । విమతగుణ వినాశ! వేంకటేశ ॥

3 "ముష్కరుండువీని మొరలాలకింపంగ । రాద"టంచు నెంచి రాజసమున
రిత్తసేయుదేమొ యిత్తరి నాపల్కు । విమత॥

4 దివిజతటినిఁగూడఁ దీర్థమాపదునీరు । నీదుభక్తియుక్తి నేవెలయుదు;
నీవుగాకప్రోవు నీభక్తులకులేరు । విమత॥

5 గాంగతోయములను కలహంసవిహరించు । సజ్జనుండుగొల్చు సతమునిన్ను;
నిన్నునమ్మువాఁడు నియతిఁదప్పఁగబోఁడు । విమత॥

6 అభయదానమొసఁగ నాపదదాటింప । నిన్ను వేఁడునే విపన్నుఁడైన;
నన్నుగాచుటెంత నామొఱవినుటెంత । విమత॥

7 వ్యాధినడఁచితగిన యారోగ్యమునొసంగి । కావఁదలఁపుమయ్య కరుణతోడ;
మ్రొక్కులెన్నొ మ్రొక్కి ముడుపులుంచితిగదా । విమత॥

8 శతకమొప్పుదునీకు సంపూర్తిగావింతు । నంతలోన రుజల నణపవలయు;
లేకయున్ననిన్ను నే కవి తలఁచురా! । విమత॥

9 ఎన్ని జన్మములనొ యేఁజేసికొన్నట్టి । పున్నెమునను నిపుడు నిన్నుగొలుచు
భాగ్యమబ్బె; నింక భవబంధములువాయు ; । విమత॥

10 పాపరాసులెల్ల భస్మంబులై పోవు । నీదుభక్తినుంత నిలచనేని;
కట్టెప్రోవులెన్ని కాల్ప దగ్నికణంబు? । విమత॥

11 ఎన్ని జన్మములను నిన్నుదలంచాయక । నన్నుతించుభక్తి చాలయిమ్ము ।
చెదని పదవిఁగాంచి చెలఁగెద ధ్రువునట్లు । విమత॥

12 కలియుగమున జీవగణమంతటికినీవ । ప్రభుడవగుచు భూమిఁ బరగినావు;
పాలనంబు సేయు భారంబు నీయదే ! । విమత।

13 ముప్పమునుఁగు జనులఁ దెప్పవై తేల్చెదు । మ్రొక్కులంది యెట్టిచిక్కులైన
వసుధ నీవజుమ్మి ప్రత్యక్షదైవంబు; । విమత॥

14 "వచ్చినారమయ్య వడ్డికాసుల వాఁడ! । యాపదలను మ్రొక్కులందువాఁడ !"
యనుచు భక్తవరులు నినుబిల్వ వెలసితి; । విమత॥

15 నిలువుఁదోపు పెట్టి నీలాలకలనుంచి । ముడుపుగట్టనొక్క గడియలోన;
మాయమౌను నే యుపాయంబులోదవిన; । విమత॥

16 కానుకలనునొక్క కానియైన మిగిల్చి । వచ్చనేనియపుడ వచ్చుదాసఁగు;
లంతలోన నణఁగు నపరాధినని మ్రొక్క; । విమత॥

17 ఇంటనింటనీవ యిలువేల్పువై గొందు । వ్రగపూజ మూలనధివసించి;
నిన్నుఁగొలువకున్న నెగడదే కార్యంబు; । విమత॥

18 పేరుపెట్టగానె పోరుపెట్టుటమాని । పాలుత్రాగజేతు బాలకులను;
శక్తిగలిగినట్టి సామివినీవయా! । విమత॥

19 ఎదురునడచి మ్రొక్క నెంతో సంతసమంది । బాధవరువనట్టి ప్రభుఁడవీవు!
ఓ దయాపయోధి నీదరిననుఁజేర్చు; । విమత॥

20 "నారుపోయువాఁడు నీరుపోసెను"నన్న । సామ్యమునను ప్రజలసాకుచుంటి;
కూడుగుడ్డనొసఁగి కూర్మిబిడ్డలపోలె; । విమత॥

21 కోరి నిన్నొకవరి గోవిందయని పిల్వ । దుష్టబాధలెల్లఁ దొలఁగిపోవు;
అంకిలడప రక్ష యూర నీ నామంబు । విమత॥

22 పాలుపండ్లు పిండివంటలు వడపప్పు । పానకంబు నన్నపానములును;
దీపహారతులును ధూపాదులిడమెత్తు; । విమత॥

23 ఎట్టిబాధవిన్న నేమేలు సేయును । నీకుపూజసల్ప లేకయున్న ?
పూజసేసి నపుడ బాధ మేలొదవించు; । విమత॥

24 ఉడుత యేమిచదివి బడసె కైవల్యంబు? । బోయ యేమిచదివి పొందెనిన్ను ?
చదువులిడవు మోక్షపదము; నీ సేవయా; । విమత॥

25 సారమతులు దుఃఖసంసారమును ద్రోసి । స్థిర సుబుద్ధినీకు సేవసేసి;
అంతమందు నైక్య మయ్యేరు నీయందు । విమత॥

26 వెకలులగుచుఁ గల్లవేల్పులఁ బూజింత్రు; । రక్తమాంసములను భక్తినిచ్చి
హింసలేకవరము లిచ్చు నీవుండఁగ! । విమత॥

27 బుద్ధి కుదురుగల్గి పూజింప నీకొక్క । మూలబొట్టువెట్ట; ముక్తివచ్చు;
ధృతిచలించి నింగి కెగరినవచ్చునే ? । విమత॥

28 ప్రజ్ఞ తమదటంచు భాషింత్రు వనులేవొ । చేసి యవ్విఫలము జెందఁగాను;
కార్యసిద్ధి నీవగావింపఁగనలేక; । విమత॥

29 శక్తి లేనివాఁడ! భక్తి నిన్నంజలి । ముద్రదాల్చి మెప్పు పొందఁజేతు;
వందనములకలరి వాంఛలనీడేర్తు; । విమత॥

30 ఏడుకొండలందు నెసగు గోపురముల । సొంపుజూడమదికి నింపునింపు;
పర్వతాగ్రమందు ప్రతిభతో వెలసితి; । విమత॥

31 నీదు నిలయమునను నిత్యకళ్యాణంబు । పచ్చతోరణంబు లిచ్చజరుగు;
చూడ మెప్పుడెట్టి చోట్ల నీ విభవంబు; । విమత॥

32 నీదుగోపురముల నివసింప శ్రీరాముఁ । గొలిచియుండఁజోలు క్రోతిపిండు;
హాస్యరసముఁజూపి యలరింపభక్తుల; । విమత॥

33 అలకయునఁగఁదనరు నలమేలుమంగావు । రంపుశోభ తరమె ప్రస్తుతింప?
మోక్షలక్ష్మికిరవు; ముక్తసంగులకావు; । విమత॥

34 తిరుపతిపయిఁబోల్చు దేవాలయంబుల । మంటపములవిభవ మహిమజూడ
వచ్చుఁజోలునిటకు వైకుంఠమనిపించు; । విమత॥

35 అమలమధురజల మయంబగుకోలఁకులు । వివిధఫలనగాళి, విహగవితతి
యొప్పుచూడనందనోద్యానమనవచ్చు; । విమత॥

36 ఇన్నిభోగములని యెన్నలేమే ప్రొద్దు । జరుపుచుందు రేరొ సిరికొలంది
సిరులకాటపట్టు కరమునీనెలవయా! । విమత॥

37 మానసంబులలర గానవినోదముల్ । పలువిధంపుతూర్యములు చెలంగు;
నీదుమంటపమున నియతిమైరొ స్వామి; । విమత॥

38 ప్రకృతిసిద్ధమగుచుఁ బరిపరివిధములఁ । జెలఁగుచుండు శేషశిఖరిసొబగు;
చూచియెట్టివారు సుఖచిత్తులయ్యేరు; । విమత॥

39 విలువలేనియట్టి విభవంబునీయది । శ్రీనివాసమగుచు చెలఁగుచుండు;
అతివిచిత్రరచన నమరెనీసౌధంబు; । విమత॥

40 కోరుకోర్కెలొసగు గోవిందరాజులు । ప్రబలవీరుఁడగు వరాహమూర్తి
నిలచినారుమహిమ నీమహాస్థలమున; । విమత॥

41 అమలతీర్థములగు నాకాశగంగను । పాపనాశనమున బహుళజనము
క్రుంకులిడుచు పాపపంకంబుబాతురు; । విమత॥

42 కోటిపాపములును గోవుగర్భముదూరి । పోవు జనులవీడి పోవుచుండు;
ఇట్టి మహిమలున్న యిరవు నీయదిగదా ! । విమత॥

43 చెప్పతరమెనీదు చెలువువర్ణనజేసి । యెట్టికవులకైన పట్టుపట్టి;
తనివితీర పోయి దర్శించవలెగాక । విమత॥

44 నీవలోకములను నిర్మించుకొని లీల । వెలుఁగుచుంటిమాయ పెట్టిజగము;
జ్ఞానియైనవాఁడ కాంచు నీతత్వంబు । విమత॥

45 నిద్రవోవువాఁడు భద్రమేగదవాని । కేడ్చినారె? మృతునకేడ్వనేల ?
దేహికున్నదెమృతి? దేహంబునకుగాని । విమత॥

46 అత్మ యెల్లతనువులందుఁ బ్రవేశించి । తానువానివలెన గానుపించు;
అక్షరుండతఁడు విలక్షణుఁ డన్నింట; । విమత॥

47 త్రికరణములఁ ద్రిప్పుదేవుండు తానొట । త్రికరణములునాత్మఁదెలియలేవు;
తెలియవలెను వాఁడతీతుఁడటంచును; । విమత॥

48 తాను, పరుడటంచుఁ దత్వంబెరుంగక । వేఱుసేయభీతి వీడకుండు;
అంత తానెయన్న నానందనిలయుఁడౌ; । విమత॥

49 పోలియు నామరూపములుగాని సచ్చిదా। నందరూపుడాత్మఁ; డెందునుండు;
నీవునట్టివాఁడ వేనును నట్టిండ; । విమత॥

50 అనుభవించి కందు రానందమయునాత్మ।మునులు,యోగిజనులు,మనములంద
పలుకఁదెలియదిట్టి పద్ధతిఁగాకున్న; । విమత॥

51 పడయవచ్చు భోగభాగ్యంబులెన్నియు; । బ్రహ్మచింతనంబు పడయలేరు;
మనుజుఁడైనదద్ది గనుటె దొడ్డఫలంబు ; । విమత॥

52 ఏడనుండివచ్చె నిలకు నీ భూతంబు? । లెటకుపోవుమరల నీల్గినంత?
యెంచనెపుడువీని సంచారములకంతు? । విమత॥

53 విద్యలేనివాఁడు విలయులేఁడుజగాన; । విద్యయిహముపరము విదుకఁజేయు
విద్యసృష్టినెల్ల వెల్గించుజ్యోతియా; । విమత॥

54 జీవగణమునెల్ల భావంబుననునొక్క । పగిదిచూచువాఁడ పండితుండు;
చదువు పండితునకు సంపాద్యమునకొను; । విమత॥

55 దేహమస్థిరమని తెలిసియుకామాంధ । కారమగ్నుడనయి కడుసెడితిని;
యాత్మఁదెలియుజ్ఞాన మనఘనాకొసఁగుము । విమత॥

56 జగముమిథ్యయనుచుఁ జాటిచెప్పుచునోర । నాత్మనెల్లబొంద నాశగోరు;
మనసువేరు,చెప్పు మాటవేరొక్కఁడౌ । విమత॥

57 మానవునకుదశలు మారునుకాలముల్ । మారునట్లు; కాల మహిమవలన
అనుభవింపవలెను హరిహరాదులకైన । విమత॥

58 కష్టమొదవఁజింతఁ గడుఁదూలఁగానేల? । సుఖముగలుగ మదిని చొక్కనేల?
కష్టసుఖములెల్ల కావడికుండలా; । విమత॥

59 మనసుతృప్తిచేత గనుసౌఖ్యమునకంటె । నరుఁడుపొందుమేలు ధరణిలేదు;
చెడుగుఁదెచ్చుతృష్ణ చెనఁటివీడఁగలేను; । విమత॥

60 మోహిమూర్ఖులెట్లు గాఢుపుకోవునో । జనుఁడుకాపురమున శ్రమలనట్టు
లోర్చియుండనేని యొప్పైనసుఖమయా! । విమత॥

61 నీరజాలువాటి యేటులైచనురీతి । విషయవాంఛపుట్టి వెల్లివిరియు;
నేర్పరద్దితొలుత నిర్మూలమొనరించు; । విమత॥

62 అబ్ధిలోనఁబుట్టి యడఁగునలలవోలె । కాపురమునశ్రమలు గలిగిపోలియు;
తనువుపట్టకుండ తపియించుటేలకో! । విమత॥

63 శాంతగుణముగల్గి సంతోషవంతులై । నెగడువారిబ్రతుకు నిర్మలంబు
సౌఖ్యదాయకంబు, సద్గతిమూలంబు; । విమత॥

64 ముక్తియనేలనయ్య! మూన్నాళ్ళబ్రతుకున । మదివిరాగమూని మమతలడఁచి,
చేరవలయు చెడని శ్రీవిష్ణుపదమున; । విమత॥

65 తీరనేనితనకు దేహాభిమానంబు । దుఃఖమింతయైనఁ దోపకుండు;
తానుగానిదేనిఁ దమిఁగాంచునజ్ఞాని । విమత॥

66 నూరుచెప్పవచ్చుఁ గూరిమిసంసార । సాగరంబుదాఁటి చనఁగరాదు;
ఆశవీడనట్టి యాలోచనంబేల? । విమత॥

# శ్రీ వేంకటేశ శతకము.

' మాతృగర్భమందు మలమూత్రములఁ జాల | పరితపించి భూమిఁ బడియు మరల,
గర్భనరకమందు కర్మమేలొకో సేయు? | విమత॥

3 సంగవర్జితుండు సౌఖ్యంబు బొందును; | సంగవర్జితుండె జగతిఁ బెద్ద;
సంగవర్జితుండె సద్గతిఁ గాంచును; | విమత॥

9 ఎట్టిసంపదలును నే నెఱుంగను తండ్రి! | పుట్టియే సుఖంబుఁ బొందియెఱుఁగ
దృఢవిరాగమూన ధృతినీయవా యింక? | విమత॥

0 కాపురము భరింపఁ గడగండ్లఁ బడుచుంటి; | తీరుబాటు మనను స్థిరము లేక;
సతము నీదు సేవ సంసృతి దరిఁ జేర్పు; | విమత॥

1 కర్మయున్నవచ్చు కాయంబు; కాయంబు | గల్గ దుఃఖములను గ్రాఁగవలయు;
కర్మఁ గాల్చి కాయ కష్టంబుఁ దీర్పవా; | విమత॥

'2 కర్మచేత పుట్టు కడగాంచ నేరండు | నిర్మలంపు జ్ఞాన నిష్ఠ లేక;
జ్ఞాని కర్మముక్తి కారణమగునయ్య | విమత॥

'3 పరమభక్తితోడ బ్రహ్మార్పణంబుగా | సుకృతముల నొనర్ప శుభము జెందు;
కర్మఫలముఁ జెందఁ గాఁడు మోక్షార్థి | విమత॥

74 కర్మవలనఁ బుట్టుఁ; కర్మంబుననఁ జచ్చుఁ; | కర్మవలన బ్రదుకుఁ గనును జీవి;
కర్మసృష్టికెల్ల కారణభూతమా; | విమత॥

75 తాను చేసినట్టి ధర్మమే తోడౌను; | కష్టకాలమందు కాయుమంటి;
పాపముండె నేని, పట్టి బాధించును; | విమత॥

76 నరుఁడు పుట్టి లోక నటనంబు నేర్పుతో | జరుపవలయు; నిహము పరము గల్గ
గ్రుడ్డియెద్దు చేన బడ్డట్లు గారాదు; | విమత॥

77 అంతమిథ్యయనుచు నజ్ఞానము నబల్కి | కానికార్యములనుఁ గఱచుచుండ్రు
మాటయున్న మాత్ర, మాయదు కర్మంబు; | విమత॥

78 మంత్రతంత్రములను మందుమాకులు జప | హోమదానములను నోగిరొనర్చి;
పాపశాంతిచేసి బన్నంబులను నీగు | విమత॥

79 దుర్మదంబుచేత దురితంబు లొనరించి | నెవ్వలంది నిన్ను నిందపరచు;
కర్మసాక్షివగుట కాంచునే దుర్మాని | విమత॥

80 మహిమఁ జెందనైన మార్గముల్ జెడిపోయె | దానులొంటకెన్నొ దారులమరె;
మంచికాలమయ్యె మహినాస్తికులకెల్ల; | విమత॥

81 పనులుసేయలేని పందలు ఘనులట్లు । తిరుగనేలగల్లు పరమపదము ?
బ్రదుకుఁదెరువువేరు, పరమమార్గము వేరు । విమత॥

82 తప్పుసేయమదికిఁ దడవాటుపుట్టదు; । యొప్పొనర్పఁ గొంకుయుప్పతిల్లు;
పరులఁజెరుప హృదయపద్మంబు వికసించు ॥విమత॥

83 వేదవిద్యవీడి విప్రులు దుర్వృత్తి । మునిఁగినారు సౌఖ్యమునకు మఱఁగి
బావలిలను నిందపాలుగాకుందురా! ॥విమత॥

84 అధికులైరి యందరన్నింటఁ దెలిపెడి । వారులేరు; తెలియువారు లేరు;
ఎవరియిచ్చవార లేగుటే ధర్మంబు ॥విమత॥

85 అన్నవస్త్రములకె యతిదరిద్రంబాయె । నిన్నుఁగొల్వనూకు నిలుకడెవుకు!;
పెట్టిపోయు ఘనులు గిట్టిరియెన్నఁడో ॥విమత॥

86 నాల్గువర్ణములును నాలుగాశ్రమములు । ధర్మబద్ధమగుచు ధరవెలయక
సంకరంబుగల్గి సరణిదప్పినవయా? ॥విమత॥

87 బాలికలకునేండ్లు పండ్రెండులోపల । పెండ్లి, కానుపులును, విధవతనము
ఆత్మస్మృతియనేటి యన్నివనులుదీరు; ॥విమత॥

88 పిన్నవారిమ్రోల పెద్దలేగుటతప్పి । పిన్నవారెమడియుచున్నవారు;
కాలమహిమసుంత కనవేమిపాపమో! ॥విమత॥

89 సజ్జనులకుఁగీడు చక్కనాశించును । దుర్జనులకుఁ ద్రోవతొలగినిలచు;
చెట్టుఁతొలుచుఁ జెదలు, శిలనేమితొలచును? ॥విమత॥

90 స్వమతదూషణంబుసలిపి సాదమునకై । పరమతంబుఁబొందబరచుచుంద్రు;
పొట్టకొరకు మతముఁ బొందుటేమతమొకో! ॥విమత॥

91 గొప్పపదవి నెందుగోరుచుఁ దమవారి । ధర్మములను జెఱుపదలఁచుఖలుఁడు;
ధరనుబుట్టుటఱయఁ దనవారిచెడుగుకా! ॥విమత॥

92 తలఁపునందుటొకటి తగసెప్పుటొక్కటి । సలుపుటొకటి, యిట్టిజనులపలుకు
వేదవాక్యమయ్యె విహితకార్యంబాయె; । విమత॥

93 ఇలనధర్మమొలసె; నెలమూఁడువానలు।కుఱియమానె: నెచటకఱవుహెచ్చె;
రూకక్డడమ్మ రోజులువచ్చెను; । విమత॥

94 ఆత్మధర్మమెల్ల నాభాసముగఁదోచె । అర్థవాదమె భువి వ్యాప్తమయ్యె;
కుమతులాడునుడులె గొప్పధర్మములాయె । విమత॥

95 కల్లమాటలాడ ఘనతపెంపొందును । సత్యమాడవాని జరిగితీరు;
భరతభూమిప్రజల ప్రతిభయింతకువచ్చె; । విమత॥

96 పశువుగలిగిమనఁగ బాసెసజ్జనులకు । దుష్టులెపుడుతమ్ము దూరుచుంట;
ఖలులఁగొల్చిబ్రతుకఁ గల్గెనుత్తములకు; । విమత॥

97 చెప్పఁబూన కలిని చెడ్డలేకనుపట్టు; । నాథ, నదియ నింద యంద్రు బుధులు;
చెడ్డతెలిపిదిద్ద శిష్టులవనిగాదె? । విమత॥

98 మనవిసెప్పినాఁడ మదినున్నతెరఁగున; । నాలకించిమేటి శ్రీలనిచ్చి,
శీలయుతులఁజేసి నేలుభారతులను; । విమత॥

99 వినుతయశుఁడుతండ్రి వేంకటరామాఖ్యు; । డంబలక్ష్మమాంబ యమలసాధ్వి;
నాకువారిసేవ లేకపోయెసతంబు; । విమత॥

100 రంగుమీఱసీకు రత్నపళ్ళెరమందు । కోరికప్పురంపు టారతిత్తు;
దేవ! కొనిశుభంబుఁ గావింపుమానాకు; । విమత॥

101 జననమందినాఁడ కౌణిడెనాన్వయమునఁ । బేరుమొదలనీవు చేరిరాగ;
ధారుణివెలసితిని నారాయణాఖ్యను; । విమతగుణవినాశ! వేంకటేశ॥

ఓం తత్సత్



శ్రీ వేంకటేశ శతకము సమాప్తము.



ఓం

శివాయ నమః.

# శ్రీ శంకర శతకము.

సీ॥ శ్రీ మహాదేవ! ఆశ్రితజనవత్సల! పార్వతీనాథ! కృపాసముద్ర!
సకలామరస్తుత సద్గుణచారిత్ర! సర్వలోక శరణ్య! సాధురక్ష!
ఆగమాంతవిచార! యజ్ఞాననాశక! యానందమయ! సామగానలోల!
పాపాటవీదావపావక! సుఖకర! దానవభంజన! ధర్మమూర్తి!
గీ॥ నిన్నుఁ దలఁచెద నాకుఁ బ్రసన్నుఁడవయి
దారిసూపుము; నినుఁ జేరఁ గోరినాఁడ!
భుజగపతిహార! కోణిదెన పురవిహార!
భక్తమందార! శంకర! భవవిదూర!

సీ॥ శ్రీహిమగిరివాస! శ్రితజనపరిపోష! చిన్మయసంకాశ! శ్రీమహేశ!
గంగాపగాధరా! కామితమందార! గౌరిచిత్త విహార! కరుణసార!
పతితపావననామ! భవ్య సద్గుణధామ! విమల పరంధామ! వినుతభూమ!
దనుజమర్దనఖేల! తాపస జనపాల! పాలింపరార! కృపాలవాల!
గీ॥ చంద్రశేఖర! హర! నిన్ను సన్నుతింప! । హరివిరించి సురేంద్రులకైన
వశమె? । భుజగపతి! 2

సీ|| అనువొంద నీరూపు కనులారఁజూడని నేత్రంబులియ్యవి నీలకంఠ!
చవులూరు నీ కథల్ చెవులార విననట్టి కర్ణములియ్యవి కామజారి!
ధన్యతఁగనఁగ నీ దాస్యంబుసేయని దేహమియ్యది మహాదేవ! దేవ!
మధురంపు నీనామ సుధఁగ్రోలకుండిన నాలుకియ్యది సురనాథ వినుత!
గీ|| నాదు సర్వేంద్రియంబులు నీదుసేవ । సార్థకతఁజెందఁ జేరితి స్వామినిన్ను!
భుజగపతి! 3

సీ|| మహనీయమైన నీమంజులాకారంబుఁ దనివిఁదీరఁగఁ గన్న తాపసులను
విమలంబులైన నీ విశ్రుత నామముల్ పఠనచేసిన మహాభక్తవరుల
నిగమ సంస్తుతములౌ నీ ధన్యచరితలు రచియించివెలసిన ప్రాజ్ఞకవుల
ఆనందమయమూర్తివైన నీసుగుణముల్ ఘనముగాఁబాడిన గాయకులను
గీ|| నెమ్మనమ్మునఁ బ్రార్థించి నిన్ను గొలుతు । కరుణనాపయి రానిమ్ము గౌరి
నాథ । భుజగపతి.... 4

సీ|| కౌండిన్యగోత్ర విఖ్యాతు మజ్జనకుని వేంకటరామాఖ్యు వినుతిజేసి
సాధ్వీలలామ నాజనని లక్ష్మాంబపాదసరోజయుగము డెందమున నిలిపి
పరమభక్త జనాళిపాదపద్మరజంబుఁ దవిలి సద్భక్తినౌదల ధరించి
సాధులపాలిఁటి సౌభాగ్యమగు మదాభీష్టదైవంబు నీ తేశుఁగొల్చి
గీ|| సర్వజనరక్షకుఁడవగు స్వామినీదు! కృపకు బాత్రతనర్థిఁ బ్రార్థింతునయ్య
భుజగపతి.... 5

సీ|| స్ఫటిక సన్నిభగాత్ర ! పటుఫాలనేత్ర ! నే నత్యంతహీనగుణాన్వితుండ
పామరుండను శాస్త్రపరిచయమూలేదు నీమహాతత్వంపు నిజమెఱుంగ
నజ్ఞుండజడుఁడనునామ్నాయములునాల్గుఁబొగడ నేరనినిన్నుఁబుణ్యపురుష
అలఁతియౌ నీసపద్యావళి నుతియింపఁ దలకొంటి నీభక్తికలిమివలన
గీ|| అన్న! యిందలి లోపంబు లెన్నకుండఁ। గొనఁగఁబ్రార్థింతుదీని మక్కువ
దలిర్ప । భుజగపతి.... 6

సీ|| నిఖిల భూతములలో నివసించు నిన్నెడ కుదురుగానిల్పి నేఁ గొల్చువాఁడ
అఖిలవిద్యలుదెల్ప నలవిమీరినవాఁడ వేవిద్య నేర్చి నిన్నెంచువాఁడ

పెక్కునామములచేఁ బేర్కొనఁబడువాఁడ వేపేర నినుజపియించువాఁడ
సర్వకాలములనే చాయఁదోచెడువాఁడ వెప్పుడేద నిన్నులయించుఁడవా
గీ॥ అజ్ఞుఁడను నాకుఁగలశక్తి యల్పమయ్య! భక్తి నినుదల్తునాకు కైవల్య
మొసఁగు। భుజగపతి.... 7

సీ॥ పరుగువారెడుబుద్ధి బలవంతమునబట్టి నీపాదములకడ నిలుపలేను
కోరికలెల్లను గుదియించిమనమునిన్ జింతించుపనికినేఁ జేర్పలేను
తనపనుల్ మాన్చినీపనులొనర్పఁగ నాదు దేహేంద్రియోద్వృత్తిఁద్రిప్పలేను
అజ్ఞానమునడంచి ప్రజ్ఞానమువహించి సర్వమీవని భక్తిసలుపలేను
గీ॥ యుడుతరీతిని నీకునేనుపచరింతు!; నాకుఁ బ్రీపయిరక్షింతు గాకతండ్రి!
భుజగపతి. 8

సీ॥ నీవకోర్కులనెల్ల నెనరుతోనియ్యంగ కల్పవృక్షముదాని ఘనమదెంత?
నీలోకసౌఖ్యముల్ నియతిగాఁబొందిన స్వర్గలోకముదాని సౌఖ్యమెంత?
నీపాదములకడ నిల్చుభాగ్యముగల్గ వజ్రసంపదవాని వాసియెంత?
నీసామ్యతరమూర్తినిస్తులంబుగజూడ స్మరునిరూపముదాని సొరదెంత?
గీ॥ నిత్యమును, నిర్మలంబును, నిరుపమాన। మైననీవిభూతుల నీయుమయ్య
మాకు! భుజగపతి. 9

సీ॥ వేదాంతములగుట్టు వివరంబుగాఁగన బుద్ధినైపుణిగల బుధుఁడగాను
అమ్నాయశాస్త్రాదులర్థసేతంబుగాఁజదువను భాషార్థవిదుఁడఁగాను
సత్కర్మములుసల్పి సన్మార్గపథమున వర్తించ పరమార్థపరుఁడగాను
శ్రేయోభిలాష సౌశీల్యంబులనుబొంద విమలవివేక సంయుతుఁడగాను
గీ॥ స్వామి! నే నేమెఱుంగని పామరుండ। నన్ను దయనేలుమయ్య
యనాథనాథ! భుజగపతి. 10

సీ॥ భూమిపైనావలెఁ బొట్టకై హీనుల సేవసేసినయట్టి చెనటిలేఁడు
అవని నారీతినీకపచారములు పెక్కురచియించిన మహాపరాధిలేఁడు
పుడమి నావిధమున భూతసంతానంబు నొవ్వఁజేసినకఠినుండులేఁడు
యిలనునాకైవడి యెపుడు దుర్వృత్తుల గాలంబుఁగడిపినఖలుఁడులేఁడు

॥ పాపసంహార ! నీనామభజనసేతు। నాదులోపంబులడఁచి నన్నాదరించు
భుజగపతి. 11

॥ లోకసంతానంబుఁ జీకాకు పరుపంగఁ జాలిన భుజబలశాలివీవు !
సర్వజగంబుల సంరక్షణముసేయ నేర్చినదయగల నేతవీవు!
బొమ్మలమాడ్కి నీ భూతాళినాడింపఁ దగుశక్తి గల సూత్రధారివీవు !
సంకల్పములమాన్చి సాధులనీలోనఁ జేరిచి సుఖమిచ్చు శివుఁడవీవు !
॥ ఎందునీసాటి దైవంబు నేనెఱుంగ ! నన్ను నీదరిఁజేర్పు మనాథరక్ష!
భుజగపతి. 12

॥ మౌళిగంగాదేవి మహిమతో రాజిల్ల నిందురోచులు దిశలందుఁ బర్వ
సర్పభూషలు మేనఁ జక్కగా విలసిల్ల రుద్రాక్షమాలికల్ గూఢిమెఱయ
మృగ, శూలడమరులు జిగిహస్తములవెల్గ సామేనఁబార్వతి చనవుసూప
ఫాలనేత్రముతోడఫాలంబువిలసిల్లఁ దనువు పాల్కడలి చందంబువెలుఁగ
॥ మహిత నీదివ్యరూపు నామదిఁ జెలంగఁ। వలచినపుడెల్ల నేత్రోత్సవముగ
సూపు! । భుజగపతి. 13

సీ॥ సంతతానందంబు సమకూరుపు మటన్న పలుకాలకింప వీపంత మేమొ
కనులారనీమూర్తి గానుపింపుమటన్న మొఱనువినవ యీమోడియేమొ
తమసేవనాకెంత దయనొసంగుమటన్న ప్రార్థనతోయు దీ పాపమేమొ
నీ దయారసము పైనిండఁ జిల్కుమటన్న మనవిపాలింప వీ మౌనమేమొ
గీ॥ దీనజనపోష! "నీవుమాదిక్కు" వనుచు। నమ్మియున్నట్టి భక్తుల నెమ్మి
నేలు! । భుజగపతి. 14

సీ। పంచాక్షరీమంత్ర పఠనంబుమానిపి మాయమాటలుపల్క మఱుపుదేల?
యోగవిద్యాభ్యాస మొనరింపకుండను దుర్విషయాబ్ధిలోఁ ద్రోయుదేల?
ముక్తికాంతామణిపొందుఁ దల్పఁగ నీక కాంతలపై భ్రాంతిఁ గప్పెదేల ?
సత్పదార్థమెఱింగి చర్చింపనీయక దుర్వివాదములలో దూర్చెదేల ?
గీ॥ మాంత్రికుఁడవీవు! నన్నిట్లుమాయఁబెట్టి। యున్మదునిఁజేసి యాడింతు
పుర్విమీద; । భుజగపతి. 15

సీ॥ జాతికిద్విజకులజన్ముండనేగాని యట్టిధర్మంబు నాయందులేదు
శాఖకేనార్వేల శాఖీయుఁడనుగాని వారియుత్కర్ష నావద్దలేదు
గోత్రంబు కౌండిన్యగోత్రంబయౌగాని ఆఋషిప్రతిభ నాకబ్బలేదు
పుట్టుపునకుఁజూడఁ బురుషుండనేగాని పురుషగుణము లేనుబొందలేదు
గీ॥ నామమాత్రంబె తగినట్టి నడతలేదు।తగినవానిగఁజేయుమోతండ్రినన్ను!
భుజగపతి... 16

సీ॥ స్వామి! నీసృష్టిలోపశుసముదాయంబు జగదుపకారార్థముగజరించు
దేవ! యీభూమిపైఁ దృణవృక్షగుల్మముల్ లోకోపకారంబె రూఢిసేయు
ఈశ! యీజగముననెల్లతరంగిణుల్ పరులక్షేమమునకే పారుచుండు
వరద! యీలోకానపక్షిసంతానంబు నితరులకేయుపకృతినొనర్చు
గీ॥ నిరతము పరోపకారార్థ నియతివలన । అట్టులవిజన్మజన్మాననందుసుగతి;
భుజగపతి... 17

సీ॥ గురువునాకెవ్వరు గుణసముద్రా! లేడు, గుఱిగనాకొప్పిన గురుఁడవీవ!
తలిదండ్రినాకేరు దానవాంతక! లేరు, తథ్యము నాతలిదండ్రివీవ!
చుట్టాలునాకేరు శుభచరిత్రా! లేరు, ప్రాపైన నాబంధువర్గమీవ!
దిక్కెవ్వరునునాకు దీనబాంధవ! లేరు, దిక్కులదిక్కు నాదిక్కువీవ!
గీ॥ అన్యమును నమ్మలేదు; నేనన్యమునకు।నాసపడలేదు;యస్థిరమైనవగుట
భుజగపతి... 18

సీ॥ కులమతకక్షలఁగూర్చి వాదములాడ బుద్ధిపుట్టింపకో భోగిభూష!
తెలిసియుండెలియక ధీమంతులగువారి నిందింపఁబూన్పకో నిగమవినుత!
అంగవైకల్యుల నతి దరిద్రులఁజూచి కరుణపుట్టింపుమో గౌరినాథ!
ఉర్వీసురుఁడనంచు గర్వించి కడజాతి నిందమాన్పింపుమో యిందుమౌళి!
గీ॥ పావనులపొందుమానిచి పాపజాతి । స్నేహమురుచింపఁజేయకు చిత్తజారి!
భుజగపతి... 19

సీ॥ గొప్పయుద్యోగముల్ గోరను జనములఁ గష్టపెట్టెడుబుద్ధి కలుగునేమొ
యైశ్వర్యభోగంబులవివేడ మదమున దేహంబుతెలియక తిరుగుదేమొ

అంచితంబగు వస్తుసంచయంబడుగను విషయాభిలాష నన్విడువదేమొ
అందంబుఁజందంబు నతిసమర్థతకోర నందరు నాచుట్టు నుందురేమొ
గీ॥ వెత్తివానిగఁగనఁబడు విధమమర్చి । నిన్నెపుడుగొల్చి బ్రదుకంగనన్నుజేయు
భుజగపతి.................. 20

సీ॥ క్షణభంగురంబైన మనుగడలో నేను యోజింతువెయ్యేండ్ల యుద్యమంబు
కాసైన చేతిలో గలుగకయే నేను దెప్పింపఁజూతును దేవనగము
నిలిచిన యెడనుండి మెలఁగనేరనినేను కలిపింపఁజూతు భూగగనములను
అణువైన కుంబోలనట్టి నేఁబూనిక నడుపనెంచెద లోకనటన మెల్ల
గీ॥ వ్యర్థపుమహాశ నన్నిట్లు లంబుధులను । జెంబుతోఁదోడిపోయంగ సిద్ధపఱు
చు భుజగపతి.... 21

సీ॥ సతులపై సుతులపై సకలసంపదలపై పెరుగు నామోహావల్లరులఁద్రెంచు
అవనివస్తువుల సత్యాసత్యతల లెస్స కనుఁగొను సద్వివేకంబునిమ్ము
సచ్చిదానంద సుజ్ఞానాత్మ నేనను సంపూర్ణ జ్ఞానంబు చాలనిమ్ము
విమల నీభక్తాంఘ్రి కమలతీర్థముఁగ్రోలి బ్రదుకంగ సద్బుద్ధిప్రబలనిమ్ము
గీ॥ నీవుదయఁగల స్వామివి! నేనువేఁడు । యిట్టివర మొక్కటీవె;సురేశవంద్య!
భుజగపతి.... 22

సీ॥ ప్రాప్తాశినై రానివానికి గుందక తృప్తితో భోగించు దేహమిమ్ము
కష్టసుఖమ్ములొక్కటిగఁబొందుచుఁ జిత్తస్వాస్థ్యముగలిగించు శాంతినిమ్ము
కలకొలంది విహితకార్యములకు ద్రవ్యమనువుగా వ్రయపెట్టు త్యాగమిమ్ము
దర్పంబు, డంబంబుఁదలఁగి వినయముతో నడువశక్తికిదగ్గనడతనిమ్ము
గీ॥ కాలమున నొక్కగడియైన కానిపనుల । గడుపకెప్పుడు నినుగొల్వఁ
గాంక్షనిమ్ము । భుజగపతి.... 23

సీ॥ భూషింపనామేను పొంగును; దూషింపఁ గోపతాపముబుట్టి గోడుపడును
పెరవారినేరంబు వెదకిచెప్పఁగనేర్తు స్వాపరాధములను దాపనెంతు
నొరులబాగునుచూచి యోర్వనుసుంతైన సిరులు నాకొకనికే చెందజూతు
నెవరికేనియు సాయమింతైన జేయను చేయువారికిఁ జెప్పిచెరుపఁబోదు

గీ॥ నాదుమది వట్టికలుషంపుఁ బాదుతండ్రి ! యెట్టుల రక్షింతు దెల్పుమీ
హీనబలుని ! భుజగపతి. ... 24

సీ॥ తాపత్రయంబును దగులఁబెట్టిమనంబు నెమ్మదితో నుంపనేర్చుటెట్లు
త్రికరణశుద్ధిగా దేవదేవునినిన్ను మనములోఁదలచంగ మఱఁగుటెట్లు ?
ఇహలోకసౌఖ్యంబు లింతైనగోరని ఘనవిరాగంబును గాంచుటెట్లు ?
దేహంబువీడి నీదివ్యపదంబునఁ జిరముగానుండంగఁ జేరుటెట్లు ?
గీ॥ దేవ!నాకారహస్యంబుఁ దెల్పుమింత। చెడని కామాంధకారమగ్నుఁడను నేను
భుజగపతి... 25

సీ॥ చేమించిదానంబుఁ జేసినవారికి శ్రమపడివ్రతములు సల్పువారి;
కఖిలేశ నిన్నెప్పు డర్చించువారికి శిష్టధర్మంబులు సేయువారి;
కాత్మార్థములువిని యలరెడువారికి సంగమేచ్ఛనువీడి చన్నవారి;
కుపకారములుసల్పి యొప్పెడువారికిఁ దీర్థంబులాడుచుఁ దిరుగువారి ;
గీ॥ కాలయు నూర్ధ్వలోకంబుల కొలఁదులెన్న । శక్యమెవ్వరికయ్యాయీజగతి
యందు । భుజగపతి... 26

సీ॥ మనసునిల్కడలేక మఱివిశ్వమెల్లనుఁ దీర్థయాత్రలటంచుఁ దిరిగితిరిగి
బుద్ధినైపుణిలేక బోధలుపలుమారు వినిసంశయముపోక విసివిసివి
చిత్తచాంచల్యంబుచేఁ బేర్లుకల్పించి పలుదేవతలనెల్లఁ గొలిచిగొలిచి
అజ్ఞానవశతను నాత్మతత్త్వముగాన కున్మత్తువిధమున నుండియుండి
గీ॥ ఫలముగానరు నీసేవకలిమివలన। కరతలామలకంబగుఁ గాదెముక్తి !
భుజగపతి... 27

సీ॥ వనవాసినై తపంబును సేయుదేనన్న వనములలోనుండ భయముగొల్పు
సతతంబు వ్రతములు సల్పుచుండెదనన్న నుపవాసములుసేయుచుండలేను
తీర్థంబులాడుచుఁ దిరుగుచుండెదనన్న దేహశ్రమలకోర్చి తిరుగలేను
భాష్యత్రయంబుఁ జేపట్టి చదివెదనన్న మాంద్యంబు సుంతయుమాన్పలేను
గీ॥ సౌఖ్యముగనీదు నామంబు స్మరణజేసి। గడచిపోయెదనట్టి దుఃఖములనైన
భుజగపతి.... 28

॥ నీరసాటవినగ్గి దూరికాల్చెడునట్లు కలుషాటవులనెల్లఁ గాల్చివేయు
దావాగ్ని వర్షంపుధారలార్చెడునట్లు యాత్మతాపంబులనారఁజేయు
జీమూతములగాలి చెదరగొట్టెడునట్లు భవదోషములనెల్లఁ బారఁదోలు
నిరులను వేవెల్గు విరియించునట్టుల యజ్ఞానతమసంబు నణచివేయు
॥ నకలుషంబైన నీభక్తి యమలచరిత ! భక్తులకుఁగల్గె నేనదివట్టుపట్టి
భుజగపతి... 29

॥ నారదు వీణానినాదంబు రంజింప బ్రమథాదిగణములు బ్రస్తుతింప
సురబృందములుజేరి స్తోత్రంబు లొనరింప నసురసంఘంబెల్లనాజ్ఞమెలఁగ
మునిరాజమండలంబులు సామమునుబాడ నచ్చరలెల్ల నాట్యంబొనర్ప
జాహ్నవీపార్వతుల్ సల్లపనములాడ గణపతికొమరులంకమున జేర
॥ మహిమఁ గైలాసగిరిమీద మాన్యచరిత! కొలువుదీరుదు భక్తులకోర్కు-
లలర । భుజగపతి... 30

సీ॥ అధ్వరమందు నీకపకారమొనరించి దండనబొందఁడే దక్షుడపుడు
జంకక నీముందుఁ బొంకుమాటాడినఁ దలఁగొట్టఁబడఁడె పితామహుండు?
అడలకపూములుకులడరించి కనుమంట మండ బూడిదగాడెమన్మథుండు?
గర్వాంధతను గన్నుగానక పైవ్రాలి కట్టంగఁబడదె గంగాభవాని?
గీ॥ అట్టిపూజ్యుల బ్రతుకులేయట్టివాయె। అల్పులిఁక దాళువారెనీకపచరించి?
భుజగపతి... 31

సీ॥ జనకుఁడవీవాదు జననిమాయుమయౌను సకల సృష్టికిని కారకులుమీర!
దుష్ట శిక్షణమును, శిష్ట రక్షణమును సలిపెడు చక్రవర్తులరుమీర!
భవవార్ధి దాటించి భవ్యమోక్షంబును బడయంగఁజేయు దేవతలుమీర!
కలుషాధములనెల్లఁ బలునీచయోనుల జనియింపఁజేయు శాసనులుమీర!
గీ॥ వేడువారికి వరముల నీడులేక । యొసఁగు దాతలుమీర! నిత్యులరుమీర!
భుజగపతి! 32

సీ॥ జగమెల్ల బ్రదుకంగఁ దగు శోభనిచ్చెడు దినకరునకునట్టి దీప్తికలుగ
చల్లఁగా సస్యపోషణమునుఁ దగఁజేయు జందురునకె యట్టి శక్తియుండ

ముజ్జగంబెల్ల సమ్మోహింపఁ గాపాడు జంభారికేయట్టి సారముంత
అవని భారంబంత నలయకే మోసెడు చిలువ రేనికెయట్టి బలిమియుండ
గీ॥ సృష్టియొనరించి శక్తులనిచ్చి నిల్పు । నీవుయెంతటివాఁడవో దేవ దేవ!
భుజగపతి! 33

సీ॥ పతిభక్తిగల లేమ భర్తను సేవించుఁ బెరచింతలనుమది సరకుగొనదు
సుజనుఁడౌ భృత్యుండు యజమానిప్రియమెంచు వేలిచ్చినను బుద్ధి వేరుపడదు
ఉపకారి జగమునకుపకృతినొనరించు నాత్మసౌఖ్యమున కాసక్తపడఁడు
సంయమి వైరాగ్యసంపన్నతను మించు భోగసంగంబులపొంతఁ బోఁడు
గీ॥ నమ్మి భక్తుండు నీచింతనంబు సల్పు। నితరదైవంబులనుభజియింపఁబోఁడు
భుజగపతి! 34

సీ॥ స్వచ్ఛమౌ జాహ్నవీ జలముల రాయంచ సమ్మోదమునఁ గేళిసలుపునట్లు
ఘనములఁజూచి ప్రీతిని నీలకంఠంబు పురివిచ్చి నృత్యంబు సలుపునట్లు
మధుమాసమున వేడ్క మఱఁగి పుంస్కోకిల మానందవార్ధిని యీదునట్లు
శారద రాత్రులఁ జందురువెల్గున వెన్నెల పుల్గింపుఁ గన్నయట్లు
గీ॥ గాఢభక్తి తాత్పర్యసంగతిఁ దనర్చి । భక్తుఁడనయము నీయందు రక్తి
మెలఁగు । భుజగపతి. 35

సీ॥ ఒకఁడె బ్రహ్మాండంబువికలంబుగాఁ జేసి నిజశక్తిమైదాని నిల్పఁగలుగు
ఒకఁడె నీరధులెల్ల నొయ్యనఁ గ్రోలివే పూరింపఁగలుగు నాతీరుమరల
ఒకఁడె భూతములేను నొంటొక్కటలయింపఁ జేసి వెండిజనింపఁ జేయునేర్పు
ఒకఁడె పదింటికినున్న దిగీశుల పదవులు దీసి నిల్పంగఁగలుగు
గీ॥ వదలకేవేళ నీపాదవనజములను । హృదయపీఠిని నిల్పియర్చించునతఁడు
భుజగపతి... 36

సీ॥ వనజభవుఁడవీవ ! వనజనాభుఁడవీవ! వాసవుఁడాది దేవతలునీవ!
పంచభూతములీవ ! ప్రాణవాయువులీవ! చంద్రసూర్యులునీవ! జలధులీవ !
పర్వతంబులునీవ! పరతత్వమునునీవ! పశుపక్షిమృగములు ప్రజలునీవ !
పాపపుణ్యములీవ! భవము మోక్షములీవ! వేదంబులునునీవ!విశ్వమీవ ?

గీ॥ యొక్కఁడగునాత్మ రూపమైయొప్పుచుందు!వన్నిటనునిన్నుఁ బొడఁగని
సన్నుతింతు; భుజగపతి... 37

సీ॥ శశిభానులను రధచక్రంబులుగఁ జేసి పుడమిరధంబుగఁ బోవబనిచి
యామ్నాయములునాల్గుహయములుగా జేసికమలసంభవు దేరుగడుపనిలిపి
యాదిశేషుని వింటికల్లెత్రాడుగఁ జేసి కనకనగంబను ధనువొనర్చి
రాజీవనేత్రు శరంబుగనొనరించి అమరసంఘమును సైన్యముగఁదీర్చి
గీ॥ యాపుత్రిపురాసురుల వధియించునాఁటి! తేజమునుతింపఁదరమా నె దేవ దేవ
భుజగపతి... 38

సీ॥ నొసటమునల్లోకముల్ మసిసేయుచిచ్చుచే నిండినకంటిని నిల్పుకొంటి
చిట్టుబుస్సనిరక్కు చిలువగుంపులఁగూర్చి దగభూషలుగ మేనదాల్చికొంటి
జగములెల్లనుఁగాల్పఁజాలిన నాకాలకూటంబుఁగుత్తుకఁగూర్చికొంటి
సర్వసంహారంబు సలిపెడుమృత్యువు బంటుగావెంటనేర్పరచికొంటి
గీ॥ జగముబొలియించు కర్తవు సత్యముగను। వదనమిాక్షింపమిాగాళ్లవాఫు
తెలియు; । భుజగపతి... 39

సీ॥ కంతునిఁగనుమంటఁగరఁగజేసిన నీకు! గామాతురతయెట్లు గలిగెనయ్య?
మృత్యుంజయుడవై నిత్యుండవగునీకుఁ బ్రళయమెవ్విధమునఁబరఁగెనయ్య?
మంగళంబులొసంగు మహిముండవీ వమంగళుఁడను పేరెట్లుగాంచితయ్య?
కాలకూటముచవిఁగన్న నీనాల్కకు భిక్షాశనం బేటి ప్రియమొ యయ్య!
గీ॥ జగములనుగాచిరక్షించు స్వామివీవ! యెట్టు లయకర్తవైతివిక్పత్తివాస!
భుజగపతి... 40

సీ॥ సందడిలేనిశ్మశానంబు శైలంబు నునికిచోట్లుగ నేర్చియుండితయ్య!
పరమేష్ఠిపునుకఁ జేపట్టినైచ్యము లేక బిచ్చమెత్తుక తిని వెలసితయ్య!
తోలుచీరెలుగాఁగఁ దొడగి మేనెల్లను బూదిచందనముగఁ బూసితయ్య!
స్థాణువవలెఁజలించక యోగనిద్రలో మునిఁగి తేలుచుఁ గేళిఁగొనెదవయ్య!
గీ॥ పరమసన్యాసమునకిట్ల పరగువిధులు!నాగజగమెఱుగంగఁగన్పఁబచితయ్య!
భుజగపతి... 41

సీ॥ మనమునీభక్తిచే మాలిన్యమునుబాసి స్ఫటికసంకాశమై బరగుదేవ!
మదినిన్నుధ్యానింప మాంద్యంబునెడబాసి విద్యుత్ప్రకాశమై వెలయునీశ!
చిత్తంబునీసేవఁ జిందిలినశియించి నిశ్చలదీప్తిమై నిల్చునభవ!
హృదయంబునీయాప్తినెసఁగినేనుదొరంగిచిన్మయాకారమైచెలగుసాంబ!
గీ॥ తనువునీపూజఁబూతమై దైవసంపదనుహసించునుగాదె భక్తునకునిందె!
భుజగపతి... 42

సీ॥కల్పాంతములవెన్నొకడచినయామేననుండఁడేఘనుఁడుమృకండసుతుఁడు?
అంబుధులన్నింటినరచేతితోనొక్క గ్రుక్కనఁగ్రోలఁడే కుంభభవుఁడు?
వేదముల్విభజించి పెక్కుపురాణముల్ రచియింపఁడేబాదరాయణుండు?
నరకవాసులపాపభరమూడ్చినాకంబుఁ బొందఁజేయండె సానందవిమలుఁ
గీ॥ డంతశక్తివారలకెట్లుబ్బెనొర? నీదుసంసేవనంబునగాదె తండ్రి?
భుజగపతి... 43

సీ॥ కార్యఘట్టములవిఘ్నములుజెందకఫలంబొడఁగూర్చుమేటిలమ్బోదరుండు
సకలదివౌకససైన్యాధిపతియయి మనిచెడుదిట్ట షాణ్మాతురుండు
మనుజులపాపముల్ మాపి పునీతులఁ గావించువిమల గంగాభవాని
వేషినమాత్రాన వెతలుమాయించి నిర్వాణంబునిచ్చు పార్వతియునీకు!
గీ॥ సుతులుసతులయి వెలసిరొ వితతతేజ! సాటినీకెవ్వరయ్యవిశ్వంబునందు?
భుజగపతి. 44

సీ॥ నీజటాజూటంబు నిర్గమించుచు గంగ భూమికిదిగివచ్చు పొలుపునంత
అందమైయాకసమంటి రాయుచువింతఁ గొల్పుకైలాసాద్రి కూటములును
అధికమనోజ్ఞంబులైన కూజితముల విలసిల్లుపక్షులు గలవనములు
పసిఁడితామరతూండ్ల మెసవురాయంచలు తిరుగఁగా నొప్పినదీర్ఘికలును
గీ॥ మనమలరనేను కైలాస మహిమలెల్లఁ గాంచెదను చేర్పవేనన్ను గరళ
కంఠ! భుజగపతి. 45

సీ॥ నందునికులమేది పొందఁడే మోక్షంబు? కడజాతివాఁడని విడచినావె?
వేశ్యకొలంబున వెలసె మహానంద దరిఁజేర్పరాదని తఱిమినావె?

కన్నప్పబోయనిఁ గడుప్రీతిఁ జేపట్టి ముందుపూజలనిచ్చి బ్రోవలేదె?
పాపాత్ముఁడైనట్టి భస్మాసురునకట్టి మించినవరమిచ్చి మెలపలేదె?
గీ॥ వీరు నీయాప్తులె శైలరిగారవింప? । నాదు నేరంబదేమి నన్నావకునికి ?
భుజగపతి. 46

సీ॥ పూజింప నీతేజమును లింగముగఁజేసి కొలువఁగ జగమున నిలిసినావు!
కాశి శ్రీశైలాది ఘనపావనక్షేత్రములయందు మహిమతో వెలసినావు!
పరమపావనియగు భాగీరథిని భూమి నేలుగాఁ బ్రవహింప నిచ్చినావు!
అజ్ఞానమును బాపనమల వేదాంత బీజములనెల్లెడ వెదజల్లినావు!
గీ॥ భక్తులందరునినుఁ జేరభవ్యమార్గ । ములనుదయచేసి యెన్నియో నిలిపి
నావు! । భుజగపతి. 47

సీ॥ నీమూఁడు తాపముల్ మేముచల్లార్చిన మామూఁడు తాపముల్ మాపుదీవు!
నీకుభోజనమిడి నిత్యంబుదలఁచిన మాకుసాదమిడిమనుపుదీవు !
నిన్ను మేమెప్పుడు నిల్కడగాఁగొల్వ మమ్మునీవేవేళ మఱువకుందు !
నీసేవలను మేము దాసులమైసేయ మాకుదాస్యమునీవు మరలసేతు !
గీ॥ భక్తులిడులేశమైనను పరమదయను । బడసి; వారికిఁ జెడనట్టిభాగ్యమిత్తు!
భుజగపతి: 48

సీ॥ దరిఁజేరవెరచుఁ బోదండధరుండైన శూలంబుతో మొత్తజూతువోయని
కబళింపవెరచుఁ బోకాలమృత్యువయిన పాదఘాతంబుచేఁ బరపుదోయని
మఱులుగొల్పందుపో పితికిమైమదనుండు వేడికంటనుగాల్చి వేయుదోయని
యాసింపరావుపోయాయాయిభూతముల్ భూతనాధుడవాజ్ఞఁ జేతువోయని
గీ॥ కాలనూపక ! నీభక్తగణమునెపుడు । నెట్టియాపదలైనను ముట్టరావు;
భుజగపతి. 49

సీ॥ హరహర ! యనిమనంబలరారనినుఁగొల్వనరచేతగై వల్యమమరునయ్య?
శివశివా ! యనినీకుఁ జేమోడ్పలొనరింప నఖిలజగద్రాజ్యమబ్బునయ్య?
పశుపతీ ! యనినీకుఁబాదసేవలుసేయ దేహతాపంబులు దీరునయ్య ?
సర్వజ్ఞ ! యనినిన్ను జపముసేయంగను కమలజుఁబదమైనగలుగునయ్య?

గీ॥ దాసజనపోష! యేమిటఁదక్కు-వగును ? నిన్నుగొల్చినభక్తిసంపన్నులకును;
భుజగపతి : 50

సీ॥ తల్లిగర్భంబునఁదాఁ బుట్టుటొకచింత బాల్యంబువిద్యచేఁబరగుచింత
జవ్వనంబున లేత జవరాండ్రపైఁజింత కౌమారదశయందు గడనచింత
జరపైకొనినఁబెక్కు- సంసారచింతలు జీవముడుగువేళ చావుచింత
యమలోకమందున జమునిదండనచింత మరలబుట్టంగ నేమరనిచింత
గీ॥ ఇన్నిచింతలు ననునేపనించుకేని ।నీదుచింతనగలిగింప; వేదిదారి ?
భుజగపతి. 51

సీ॥ వేదవేదాంతముల్ విప్పిచెప్పఁగవచ్చు పరపీడనముపీడ వలనుగాదు
శాస్త్రవాక్చర్చలు సలుపంగవచ్చును అనృతవర్తనమును నణపగాదు
పుణ్యకర్మలుచేసి భూషింపఁబడవచ్చు నొరులదూషించుట యుడుగరాదు
సంసారముద్యజించి సన్యాసిగావచ్చు మదినికాంక్షలనెల్ల మానగాదు
గీ॥ నోటితోమాటలెన్నైన నుడువవచ్చు। నిన్నుమదిలోన నిముసంబు నిలువ
లేము; । భుజగపతి.... 52

సీ॥ జ్ఞానంబుకలిగిన మాను నజ్ఞానంబు పున్నెంపుకలిమిని పోనఘంబు
దానంబువలనను దారిద్ర్యముతొలంగు గుణవంతుఁజెల్మి దుర్గుణముపోవు
నీశుఁజింతనమున నితరచింతలుపోవు శాంతమునను కష్టమంతపోలియు
యోగంబుచేఁ జిత్తరాగముల్ నశియించు తృప్తిచేతను తృష్ణతీరిపోవు
ధర్మమున భీతియంతయుఁ దలఁగిపోవు । సత్యమున నపజయమును సమసి
పోవు; । భుజగపతి.... 53

సీ॥ కాశీప్రయాగలు కాంచఁగనేకాదు షట్శాస్త్రములువిప్పి చదువఁగాదు
పున్నెంపుక్రతువులుపూర్తిచేసినఁగాదుతొలిపల్కు-లను నేర్చిపలుకఁగాదు
యోగాదిసాధన లొందియుండినఁగాదు గురువులఁబదుగురిఁగూడఁగాదు
చిరకాలముజపంబు సేయుచున్నను గాదు తనువుకృశింపంగమనినగాదు
గీ॥ నీదుతత్వంబుగనుగొన నేరవలయు ।భవజలధిదాటు సాధనపట్టవలయు
భుజగపతి.... 54

సీ॥ సంధ్యాగ్నిజపతపస్స్వాధ్యాయశౌచాది సత్కర్మములఁ బ్రీతిసలుపవలయు
నాశ్రమధర్మంబు లనువుగాసల్పుచు దుర్వృత్తులకు వెలిఁదొలఁగవలయు
నందఱసమదృష్టి నఱసివర్తించుచు భోగకాంక్షలఁ బొరిఁబుచ్చవలయు
సద్ధర్మములఁ దారుసల్పుచు నొరులకు నింపుగాఁజెప్పి చేయింపవలయు
గీ॥ ఇట్టిధర్మంబు ద్విజులకు నెల్లప్రొద్దు । శుభములిచ్చునవారిగా శుభచరిత్ర
భుజగపతి.... 55

సీ॥ పుణ్యకర్మలు జేసి భూమిదేవులకిచ్చి దేవతాళికిఁ దృప్తి దీరఁజేసి
బంధురాజికిఁ బ్రీతిప్రబలఁగా నటియించి ఆప్తులకానంద మమరనడచి
న్యాయవిత్తముఁ గూర్చి యభిమతభోగంబులందినత్సంతానమమరఁగాంచి
యవసరకృత్యంబులాచరింపఁగఁ జేసి పరులకొప్పిదమైన సరణిమెలఁగి
గీ॥ పురుషుఁడొందును సత్కీర్తి భూరి పదవి; । సత్ప్రవర్తన సకలార్థ సాధ
నంబు; భుజగపతి... 56

సీ॥ అఖిలజీవంబుల నాత్మయట్టులుగాంచు నేప్రాణినెప్పుడు నేచకుండు
ప్రాణంబునిల్పనై భైక్ష్య మెత్తుకతిను ప్రాపంచగోష్ఠిని బట్టకుండు
రాగాదులనడంచు భోగేచ్ఛఁబొరిఁబుచ్చు సత్యంబుశాంతంబుసమతగనును
నిన్ను భజించును నిగమాంతములెఱుంగు జ్ఞానవైరాగ్య నిధానుఁడగును
గీ॥ విజనవాసియై యింద్రియవిజయమొందు । పరమ సన్యాసియగు వాఁడు
భక్తవరద! । భుజగపతి... 57

సీ॥ పెట్టిననేగాని పేరురాదేరికి దిద్దితీర్చినఁగాని బుద్ధిరాదు
చదివినఁగాని యేసంగతుల్ తెలియవు వినయంబుచేఁగాని ఘనమురాదు
దైవబలమునఁగాని తనయత్నములుగావు భక్తిచేఁగాని నిన్నట్టగాదు
ఓరిమిచేగాని యొప్పదునడవడి యాశపోయినఁగాని యార్తిపోదు
గీ॥ పామరుఁడెరింగి యిట్టులభ్యాస పడిన । యుత్తమ మహోన్నతిని గాంచి
యుర్వివెలుఁగు । భుజగపతి .. 58

సీ॥ ఒకయెడఁ దిన్నఁగానుండుటకలుగదు మనమార నినుఁగొల్వ ననువుపడదు
నిశ్చింతతోనుండ నిముసమేనొదవదు పదుగురలో గౌరవంబురాదు

ఇష్టసౌఖ్యముఁబొందుటింతైనఁ గలుగదు ప్రతిభఁగలాఁడయి బ్రదుకలేదు
దానధర్మము సేసి తనియఁజొప్పడఁబోదు సత్క్రతువులనెల్ల సలుపఁగాదు
గీ॥ పాపమున నిట్టిదారిద్ర్యబాధ గల్గు।నిన్నుఁబూజింప నధికసంపన్నుఁడగును
భుజగపతి... 59

సీ॥ కలుషహరంబగు గంగాస్రవంతినీజలముల స్నానంబు సలుపలేదు
అహరహంబును దేవతారాధనముఁజేసి తీర్థంబుగ్రోలిన దినములేదు
యేప్రొద్దు నీసేవనెల్ల చింతలుమాని యలరారు భక్తులచెలిమిలేదు
నిరతిశయానంద నీరాజనంబిచ్చి నీపూజసేయంగనోపలేదు
గీ॥ హరయనఁగ నెల్లపాపములడఁగుననుచు।నమ్మియున్నాఁడదృష్టాంతమిమ్ము
తండ్రి । భుజగపతి... 60

సీ॥ వరవివేకియుఁదపోనిరతుండు శాంతుఁడు శమదమాన్వితుఁడుఁను సత్యపరుడు
ధర్మాత్ముఁడును శీలధనుఁడువిరాగియుబ్రహ్మనిష్ఠుఁడునుసద్బ్రాహ్మణుండు
సకలకలావేది యకలంక చరితుండు దానకరుండును జ్ఞానయుతుఁడు
మహిమవంతుండు సమాధియుక్తుండునుమౌనావలంబియుమాన్యయశుఁడు
గీ॥ సతము నీపూజసల్పిన సజ్జనుండె।పరమపదనిత్యనిలయుండుసురనుతుండు
భుజగపతి... 61

సీ॥ "శాశ్వతంబేదియీజగతియందునసర్వమణఁగు; కాలమురాగననుచుదలచు
"మానసమా ! నీవు మానకేపరమేశుఁజింతన" యని తానుసెప్పికొనును
ప్రాణులఁగాంచి "యీపరమాత్ముఁడన్నింటఁ గల"డంచు మోహమువికాస
[పరచు
జీవుల కష్టముల్ జిత్తగించుచు "రాగమిటుసేసెనీని"నంచిస్సిరోయను
గీ. గానియొక్కప్పుడువిరాగిమానసంబు।దుర్విషయమగ్నమైకీడుద్రోవజనదు
భుజగపతి... 62

సీ॥ ఐకమత్యములేక వన్నింటగతిమాలి చెడుదీనులకు బుద్ధిసెప్పుచొకట
"వేదధర్మంబిదివిడువకుం"డని ధర్మమార్గంబునకుఁ బ్రజమలుపుచొకట
"బాపురే! మీరెంతభవ్యాత్ము"లనిసాధుసంఘములకుసేవసలుపుచొకట
అతిదరిద్రులకింత యన్నవస్త్రములకు వృత్తినైనఁగల్పించుచొకట

గీ॥ దిరుగు ధార్మికుఁడాత్మ మేలెఱుగకుండ। నితరులకు మేలు సేయుచు నెల్లయెడ।
భుజగపతి... 63

సీ॥ అలకాపురాధీశు నపహసించునుగాని ధనములో నను దరిద్రంబు లేదు
నాకేశుగర్వంబుఁ గాకుసేయునుగాని విభవంబులకు నేమి వెలితి లేదు
భోగీంద్రుమర్యాదఁ బులిమిపుచ్చునుగాని భోగంబు కేమియు నోగు లేదు
చతురాననుని పెంపు సడల సేయునుగాని భవ్యంపు వృత్తి కల్పంబు లేదు
గీ॥ గాఢవైరాగ్యవంతుఁ డికట్ల రణి నెల్లఁ। దన దునాత్మనె గల్పించితనివి సెందు;
భుజగపతి... 64

సీ॥ ప్రాణసంయమనానుభవమైన మనమును భువనరక్షకునితోఁ బొందనిలిపి
సకలేంద్రియములు స్వస్థానంబునకుఁ జేరఁ గాయంబు వీడు వోఁ గాంచుచుండి
సచ్చిదానంద సుజ్ఞానాత్మ తానను ప్రజ్ఞ యొక్కటిఁ బెడఁబాయకుండి
రాగంబు లేమిఁ దొరంగెడు నాగామి సంచితంబుల కెల్ల స్వస్తిజెప్పి
గీ॥ అంతమొందఁ బ్రారబ్ధంబు ననుభవించి। మాయ నెడలించి జ్ఞానినీమఱుఁ
గుఁజొచ్చు; । భుజగపతి... 65

సీ॥ పులకింపవలె మేను పలికిన నీమాట చొక్కిపోవలె నిన్నుఁ జూచె నేని
వివశుండుగావలె చెవులనీకథ విన్నఁ బ్రమదంబుఁ గొనవలె భక్తిసేయ
ఆశింపవలె నిన్ను నహరహంబును గొల్వ విరియింపవలె మోము స్మరణ సేయ
దమిఁ బూనవలె భవద్దాససఖ్యంబన్న నీవు కోరినఁ బ్రాణమీయవలెను
గీ॥ పరమపదవాస! యిటువంటిభక్తజనుఁడె। గాంచునీరూపు; తక్కొరు గాన
లేరు । భుజగపతి... 66

సీ॥ అణిమాది సిద్ధులనందంగవలసిన భక్తితో నిన్నె గొల్వంగవలయు
విద్యలెల్లను నేర్చి వెలయంగవలసిన స్థిరముగా నిన్నె పూజింపవలయు
సుఖలోలుఁ సూక్తుల సుకవిత్వమును జెప్ప చేతంబు నిన్నె యర్చింపవలయు
జ్ఞానవైరాగ్యంబు లూని మోక్షముఁ బొంద నియతి నిన్నె మదినిల్పవలయు
గీ॥ ఆశ్రితులపైని దయఁదాల్చియప్పుడప్పుడ । వేఁడు వరములనిడు గొప్ప వేల్పు
వగుట; । భుజగపతి... 67

సీ॥ వేయిజిహ్వాలతోఁడ విడువక శేషాహి వర్ణింపనీనీదు భవ్యమహిమ
వేయికరములతో విడువకయినుడొప్పు రచియించనీనీదు రమ్యకథలు
వేయికన్నులతోడ విడువకసురపతి చూడనీ నీ మేనిసొబగునెల్ల
వేయివీనుల హరివిడువ కేకాలంబు నాలింపనీనీగుణాతిశయము
గీ॥ నంతముండదు, తృప్తియునమరఁబోదు। చిత్తమమృతాంబురాశినిఁజెలఁగు
చుండు। భుజగపతి... 68

సీ॥ షట్కాలములయందుస్వామినీకెవ్వండునభిషేకములుచేసియమలుఁడగుచు
గంధపుష్పాది సుగంధద్రవ్యంబులఁ బూజించినైవేద్యములనొసంగి
కీర్తనంబునుజేసి నర్తనంబునుసల్పి నేలఁజాగిలిమ్రొక్కి చాలభక్తి
నుపనిషత్తులుగీతలాగి శ్రద్ధబరియించి నిత్యకర్మంబులునియతిఁదీర్చి
గీ॥ తీర్థమునుగ్రోలిభుజియించుసార్థజన్ము। జీవితఫలంబువివరించి చెప్పఁదరమె
భుజగపతి... 69

సీ॥ తల్లిదండ్రులుదన్ను నల్లారుముద్దుగా మురిపెంబుతోఁ బెంపఁ బెరిగిపెరిగి
గురుకులవాసంబు భరమనియెన్నక సకలసద్విద్యలఁ జదివిచదివి
జగమందుగావించు సకలకార్యగతుల మెలఁకువలన్నింటిఁదెలసితెలసి
సర్వభోగంబులు సకలకష్టంబులు ముదమునజింతయుఁ బొందిపొంది
గీ॥ తుదిశరీరంబు నగ్గిలోవదలి యాత్మ। యెచట నిత్యమైయుండునో యెఱుఁ
గనయ్య। భుజగపతి... 70

సీ॥ కాగినలోహంబుగతి నాదుడెందంబు యుషివోనియాశలనుడుగుచుండు
నొకకానిత్రముదీర నొక్కటియెదగోరు "నింతకుచాల"ను నిచ్చలేదు
సంసారసుఖములు స్వప్నవృత్తాంతముల్ క్షణభంగురంబులుచావునిజము
పుట్టుకతోడనే బుద్ధియాశలఁజుట్టుఁదెరలింపగష్టంబు ధృతియునున్న
గీ॥ యెట్టులోయేనుభవవార్ధి నీదినీదు। దివ్యధామంబుఁ జేరుట దేవ దేవ!
భుజగపతి... 71

సీ॥ ఎంతవారలకైన నేకొంతలోయుండు కొఱఁతలేకున్నట్టి నరుఁడులేఁడు
యెట్టివాఁడైనను బుట్టువు చావొందుఁ జావుబుట్టుకలేని జన్మలేదు

జనులెల్ల సంసారశ్రమల నొచ్చెదువారె కాపురంబుఁ గడలిఁగడచుటరిది
అఖిలంబువిధిశక్తి కగ్గమయ్యే యుండు విధిబలంబును దాటువిధము లేదు
గీ॥ కాన, యీభూమిపైఁ బుట్టఘనము లేదు। మరలభవమీకు నాకునీమా
యఁగప్పి!; భుజగపతి. 72

సీ॥ జ్ఞానమిచ్చెడువిద్య కాన రాకనెయుండు మరులుగొల్పెడు నదేమదికిఁదట్టు
సన్మార్గులతో స్నేహసంబంధమేరాదు నీచులేపైప్రక్క నిలుతురెపుడు
ముక్తసంగునిగురు ముఖముకన్పడఁబోదు క్షేమధార్గను జేరి విడువఁబోరు
నిజభార్యపైఁ బ్రేమనిజముగాఁగలుగదు పరకాంతలన రుచిబరుగుచుండు
గీ॥ నిట్టిదుర్గుణములనెల్ల గిట్టఁజేసి। నిర్మలాత్మ నొసంగెదు నిన్నుఁగొల్వ
భుజగపతి!. 73

సీ॥ తనకుభాగ్యంబున్నఁ దాఁదినిచేమించి దానధర్మముసేయఁబూనవలయు
తానుపండితుఁడైన దాచకతనవిద్య బోధింపవలెఁ గోరుబుధులకెల్ల
తాజ్ఞానియైనను తగఁజెప్పిప్రజలకుఁ గల్లసేద్యముమాన్ప గడఁగవలయు
తానుభూధవుఁడైనఁ దనప్రజసంతోష వార్ధిఁదేలంగఁ గాపాడవలయు
గీ॥ శక్తిచాలియుఁ దగురీతిసలుపకేని। జగమునిందించు వారికి సుగతిలేదు;
భుజగపతి.

సీ॥ జొంపమాభూజంబుఁ జూచిచెంతకుఁజేర చల్లనినీడల శాంతపఱచు
తేటయామధురంపునీటివాకనుడాయ నమృతాంబువులనుదాహంబుఁదీర్చు
ధావళ్యరుచులతోఁదనరుసోముని:గాంచ శిశిరచంద్రికలచేఁ జేయుసుఖము
వలిఁగొని బీరెండ నిలిచినవేవెల్గు వేఁడిమిశీతును వీఁడబుచ్చు
గీ॥ అభవ! నీసద్గుణంబుల నఱసిశరణ। మనుచు నినుఁజేర తాపత్రయము
హరింతు। భుజగపతి. 75

సీ॥ స్వర్గలోకమున గీర్వాణులై పుట్టిన కొన్నాళ్ళుబ్రదుకులె కూడుగాదె!
యెల్లలోకంబుల నేలంగఁబుట్టిన చావు నిక్కంబయి జరుగుగాదె
భూతగణంబులై పుట్టినేనియుఁ గాల మాసన్నమై త్రుళ్లుటగునుగాదె
ప్రాణులఁబుట్టించు బ్రహ్మయై పుట్టిన గల్పాంతమునఁ జావుకలుగుగాదె

గీ॥ ఎవ్వ రేమిటి కొయ్యెడ నెప్పుడుండు । వారలగు దురు నీ దాసవరులుగాక!
భుజగపతి... 76

సీ॥ మనువులు నెందరో మారిన నీరూపు సుంతైన జెదరక శోభ జెలగు
బ్రహ్మకునూ తేండ్లు పైబడి యడగిన జెలువుగా నీవట్లె చెలగుచుండు
హరి మఱియొకున నబ్ధిపై బండిన దినమునందైన నీతనువు సెడదు
మరల నిట్టుల నెన్నిమారులు జగములు పుట్టిపోవుచునున్న గిట్టకుండు
గీ॥ నిగమసంస్తుతయోంకారనిలయుడవగు। నీవొకండవ శాశ్వతదైవమగుదు;
భుజగపతి... 77

సీ॥ సుంతైన సమగ్రస్వాంతంబుతో బాత్రుడగు వానికిడుదాన మధిఫలంబు
మోమాటమునువీడి మోలజంకుదొలంగి నిజమాడుటద్ది సునీతిపథము
నిజకులోచిత వృత్తినెగడుచు సత్ప్రవర్తన నేగ వంశవర్ధనకరంబు
నీపాదతీర్థంబు నిత్యంబుసేవించి బ్రదుకుట జన్మసార్థకవిధంబు
గీ॥ మాననీయుడు జదివినదానగలుగు । ధీసమగ్రత వీనిని దెలియవలయు
భుజగపతి... 78

సీ॥ తనతప్పులను దిద్ది తగశాస్త్రపద్ధతి నడచుసుశీలుండె న్యాయవిదుడు
మనమువాక్కునుకర్మమును నేకముగ జేసిహితకార్యములుసల్పునతడెసుమతి
మనమునజనియించు మమతలనడగించి యోర్మినుండెడువాడె యోగిసేత
ద్వంద్వంబులను సమభావంబుతో గాంచి ప్రీతిలువాడె వివేకశాలి
గీ॥ కడుప్పుకై నీచములకు బాల్పడక నిన్ను । దైవముగ గొల్చునాతడే
ధన్యతముడు । భుజగపతి... 79

సీ॥ అక్షరాభ్యాసంబు నంననీనామామృతము గ్రోలజేసె నెంతయుగురుండు
భక్తులెల్లరు జెప్పపరమసాంపపురాణ గ్రంథాంతరములనీకథలు దెలిపె
తేజోమయుంబులౌ దివ్యస్థలంబుల కన్నులార గన్నుం గాంచగలిగె
ఓంనమశ్శివాయ ! యోదేవ! యోనాథ యనిసేయు దాసప్రార్థనలవింటి
గీ॥ ఎంతమూఢుండనైన నేనిన్నివిధుల । నిన్ను సేవింపముక్తిసంధిల్లకున్నె ?
భుజగపతి... 80

సీ॥ వేదముల్ నాలుగు వేదాంగములునారు ధర్మశాస్త్రంబులు దర్శనములు
నఖిలపురాణేతిహాసముల్ స్మృతులు వేదాంతభాష్యములనుద్గ్రంథచయము
గురుకులవాసియై నెఱిబ్రహ్మచర్య సన్నిష్ఠతోఁ జదివిమన్నించితనకు
ఆర్యులొసంగు కన్యనువివాహంబాడి సద్వృత్తి జీవికజరుపుకొనుచుఁ
గీ॥ ప్రతిభజెందిన నుత్తమబ్రాహ్మణులకు । దాస్యమొనరింప నధమవిద్యలు
రుచించె । భుజగపతి... 81

సీ॥ అన్నవిక్రయము కన్యావిక్రయముసేవద్యూతంబుఁబానంబు దొంగతనము
బొంకుఱంకువిభేదమును వంచనము హింసహీనత దీనతమానహాని
యాదిగాఁదగనట్టి యధమవృత్తులఁబూని ద్రవ్యార్జనంబునఁదనివిసనక
కడులోభమతిని భోగములపైనాసక్తి నితరులమేలున కేడ్చుబుద్ధి
గీ॥ గలిగిజీవించు బాపలుగలియుగమున। వృద్ధిజెందఁగ యాధిక్యమేడనిలుచు
భుజగపతి .. 82

సీ॥ స్వీయవృత్తులమాని సేవసేయగఁవచ్చుతనధర్మమునువీడి మనగవచ్చు
నన్యాయముగడబ్బు నార్జింపవచ్చును సచ్చరిత్రముఁబాసి చనఁగవచ్చు
వేషభాషలుమార్చి వెకలియైపోవచ్చు తప్పుగ్రంథంబులు జెప్పవచ్చు
హేయంపుపద్ధతులెల్లబూనఁగవచ్చుఁ దలఁచినట్టుల భువిమెలఁగవచ్చు
గీ॥ నెవ్వరెట్టుల నడచిన నేమిభయము? । పాడిమెయి శిక్షసేసెడువారులేరు;
భుజగపతి... 83

సీ॥ వర్ణాశ్రమంబులు వట్టిబూటకమాయె నిగమాగమంబులు నిందలాయె
దేవపితృలభక్తి భావశూన్యంబాయె పండితారాధన ప్రాప్తిమాసె
జాతిమచ్చరముల చర్చలు మెండాయె యతిదూషణలుపెక్కుమతిఁగరంచె
సత్కులాంగనలును సరణితప్పుటలాయెనింటింటఁగలహములెక్కుఁడయ్యె
గీ॥ కాలవర్షములెల్లను గడచిపోయె । పిదపబుద్ధులె ప్రజలకుఁ బదిలపడెను;
భుజగపతి... 84

సీ॥ఒకఁడునేరమొనర్ప నొకడుదండననొందు నొకడుసంపాదింప నొకడుబొందు
నొక్కఁడు పనిసేయ నొక్కఁడుఫలమందు నొకఁడుసంతోషింప నొకఁడు
[కుందు

నొకఁడు దైన్యమునున్న నొకఁడుసమ్మోదించునొకఁడు మేల్జేయబో నొకఁడు [ జెఱచు
నొకఁడు హితవుఁజెప్ప నొకఁడు కాదనునొకఁడు పెద్దగనున్న నొకడుదిట్టు
గీ॥ కలియుగంబున నీతి యీకరణిమూరె।పాపమునడంచి భారతప్రజల నేలు!
భుజగపతి... 85

సీ॥ అగ్రహారములెల్ల నన్యులపాలాయె మాన్యంబులన్నియు శూన్యమయ్యె
విలసిల్లు జీవనవృత్తులన్నియునూడె మర్యాదలెల్లను మంటఁగలసె
సద్విద్యలను నేర్చు జాడలుపాడాయె శపియింపదీవింప శక్తి చచ్చె
సత్తబోధనములు సంపూర్ణముగ మాసె కులమతద్వేషముల్ గొప్పలాయె
గీ॥ సజ్జనులకిట్టి కాలమసహ్యమాయె।సుఖము లేదాయెధర్మంబుశూన్యమాయె
భుజగపతి... 86

సీ॥ అల్పవిద్యలు నేర్చి అధికారమువహించి ఉత్తమాచారంబులుడుపువారు
భవ్యపురాణ కావ్యంబులఁగని పుణ్యపురుషవర్యుల నిందబఱచువారు
బ్రిదుకగా నిజమత పరమధర్మువుహీనమని యంత్యమత ధర్మమందువారు
స్వీయదేశోన్నతిమాయించు విధులూని ప్రభుప్రులమన్ననఁ బడయువారు
గీ॥ కర్మభూమినిఁ గలిగిరి కాలమహిమ।ధర్మమార్గంబునిలుపుముదయఁదలిర్ప
భుజగపతి... 87

సీ॥ విద్యలకెల్లను వేదముత్తమమని అగ్రజులదినేర్వ ననుమతిమ్ము।
దేవ భూసురవృత్తు లేవిధంబునఁదీయకనువుగాఁబొదుగించిమనుపఁజూడు!
ఆర్యసంతతి కాయురారోగ్య సౌఖ్యసంపద లవారికనిచ్చిపొదలఁజేయు!
గోవులఁగాపాడికుమతులఁదునుమాడిశుభసంప్రదాయముల్ జొనుపుప్రజల!
గీ॥ సుకవులకు నీదుపదమిమ్ము సుకరముగను। భక్తగణముల వాంఛిత
ఫలము నిమ్ము! । భుజగపతి.... 88

సీ॥ నట్టింట నిక్షేప ముట్టిపడ్డట్టుగ నిఖిలసంపదలును నెగడినట్లు
వాసవభోగముల్ ప్రాపించినట్టుల పూజ్యత మహిమంబుఁబొందినట్లు
సార్వభౌమపదంబు సమకూరినట్టుల సద్వ్రతంబులనెల్ల సల్పినట్లు
దీపరాక్రమశక్తిఁ దేజరిల్లినయట్లు అఖిలజనులమెప్పు నందినట్లు

గీ॥ కడుముదంబున సాధులఁ గష్టపఱుప | పరుగులిడుదురు మూర్ఖులు పాపమునకు
భుజగపతి.... 89

సీ॥ అప్పటిమురిపంబె యావలఁ దాసల్పు క్రూరంబునకుఁ బ్రతికూడకున్నె?
సంపదాంధతను సజ్జనులకుఁ బరిభూతిఁ గావించి హైన్యంబుఁ గాంచఁడోటు?
కండక్రొవ్వునఁ గన్నుకాలనఁ గండ దుర్నడతనడచి ముప్పుఁ గుడువఁ డాడె?
దేశోపకారంబుఁ దెలియకెంతేని ద్రోహంబొసరించి నాశంబుగాఁడె?
గీ॥ ముందు వెనుకలారయకుండ మూర్ఖుఁడాత్మ | పఱచిన ట్లెల్లఁ బఱచి తత్ఫలము
గాంచు | భుజగపతి.... 90

సీ॥ ఏ గాకో యీపూజలీతాలకెల్లను దైవంబు మనమునఁ దలఁపలేఁడె?
యీవిద్యలేలొకో! భావశుద్ధినిఁ బొందఁ గైలాసమెదురుగ నేలరాదు?
నిస్సంగిగా నింట నిలువ ముక్తుఁడుగాఁడె సన్యాసిగా నేల సతిసిబాసి?
తన తాతతండ్రులఁ గసమె శ్రమంబైన యిట్టి నీమములెల్ల నితనికేల?
గీ॥ యనుచుఁ గొఱఁగాని సోమరులార్యసమితిఁ | జూచి పల్కెద; రున్నతి
సూడలేక | భుజగపతి.... 91

సీ॥ ఉన్మత్తుఁడగు నరుఁ డొప్పుతప్పెఱుఁగునే! కారానిపనులెల్లఁ గఱచుగాక
కుపితునకోరిమి గొనముందునే? యెల్లచెయ్వులు చెడఁగొట్టి సేయుఁగాక
పాపాత్మునకు ధర్మపథమున్నదే! చనఁదొడిఁ బడ స్వేచ్ఛగ నడచుఁగాక
రాగాత్మునకుఁ గోరరానియుఁ గల్గునే? యేచి సర్వముఁ బొందఁ జూచుగాక
గీ॥ మొఱకునకు సజ్జనుండను బుద్ధిగలదె? | చెనఁటితోఁ బోల్చి యవమతి సేయు
గాక | భుజగపతి : 92

సీ॥ స్వమతవర్ణాశ్రమాచారముల్ విడచిన నీచమర్త్యునకేటి నీతికలదు?
తలిదండ్రులనెతిట్టి పలుపాట్లఁ బఱచెడు కఠినునకేయనుకంపకలదు?
అనుజాతుద్రవ్యాపహరణంబుఁ గావించు ద్రోహికేన్యాయంపుటీహకలదు?
వేదవిప్రులఁ బన్నెత్తివాఁగెడు తిట్టుబోతునకేది తెలియఁగలదు
గీ॥ హరిహరాదులు వేరను నజ్ఞునకును | సదమలజ్ఞానభక్తులెట్లొదవఁగలవు?
భుజగపతి : 93

సీ॥ ధర్మకార్యములకుఁ దలపెట్టకుండిన మానవుధన మెంతయైన నేమి ?
తన దేహముపకారమునకుఁగాకుండిన నత్యంతబలయుతుండైన నేమి ?
తనజీవనము సౌఖ్యమునుబొందకుండిన నవనియంతకుఁ బ్రభుండైన నేమి ?
తనజీవితమున దేవుని భజింపకయున్న నయుతాబ్దములుమనినైన నేమి ?
గీ॥ ధర్మసత్యక్షమాహింసనిర్మలత్వ । ములనుగాంచక తానేమిసలిపియేమి ?
భుజగపతి... 94

సీ॥ తలిదండ్రియాబ్దికములనెపెట్టనివాడు సంతర్పణంబులు సలుపునొక్కొ ?
తనకుల దేశికున్గనిన మ్రొక్కనివాఁడు ఘనులజూచిన నమస్కారమిడునె ?
యాలుబిడ్డలుతింటకాయాసపడువాఁడుదానధర్మము సేయఁదలఁపఁగలఁడె;
చుట్టాలభాగ్యంబె సూడనోపనివాఁడు ఇతరులకలిమికి నేడ్వకున్నె ?
గీ॥ స్వాత్మహితవునెయెంచని పరమమూర్ఖు । డొరులకపకృతిసేయకెట్లుడుగు
నయ్యా ? భుజగపతి... 95

సీ॥ చెలువంపుసేతలఁ జెఱుపఁజూతురుగాని సరిగానిపనిదిద్దఁ జాలరెవరు
వాదంబులేకుండ బాగుసేయరుగాని కలతఁగల్పింతురు కలిమిఁజెరుప
దుష్టత్వమునుమాన్పఁ ద్రోవసూపరుగాని లేనిదికల్పింపఁ బూనుచుందు;
రొప్పుచెప్పుటకునై యోపకుందురుగాని తప్పులువచియింపఁదలఁకకుంద్రు;
గీ॥ దేవభూసురదూషణ తెలివిమాని। సేయుదురుగాని, నీసేవ సేయలేరు;
భుజగపతి। 96

సీ॥ పరువురాఁగోరిన బాపలనిరసించి దైవనింద మొనర్పఁ దలఁపవలయు
ధనమునర్థించిన ధర్మబాహ్యంబుగా లక్షలగ్రంథముల్ వ్రాయవలయు
యధికారమును వేడనాత్మశీలముఁబాసి మతమతాంతర రుచుల్మఱగవలయు
సుఖమునాశించిన సుజనులఁబోద్రోలి వర్ణసంకరుఁ జేపట్టవలయు
గీ॥ నుర్విసీరీతి విపరీత ముద్భవిల్లె । మాన్యులకు దిక్కికేమి నీమహిమదక్క
భుజగపతి. 97

సీ॥ పరధర్మములుసల్పఁ బరువులువాటెడి మనుజసంఘంబుల మనఁగఁ జేసి
కులవృత్తులనువీడి ఖలవృత్తులకుఁ జొచ్చి బ్రదుకుజాతులనెల్లఁ బ్రబలఁ జేసి

ద్రవ్యసంపూర్ణతఁ దనరిబీదలయార్తి మాపనిలోభులమలయఁజేసి
దేశభక్తిఁబొలంగి దేహంబుఁదెలియక ద్రిమ్మరుహీనులఁ దిరముజేసి
గీ॥ యకట! మాభారతస్థలి కధికమైన। చెట్టసేసితి; తీర్పంగఁ జిత్తగింపు
భుజగపతి. 98

సీ॥ ఐకమత్యముఁగూర్పుమయ్య! ప్రజాళికినన్యాయమునుమాపిన్యాయమిడుము!
సాధ్వీమతల్లుల జగమునిండఁగనిల్పు! సద్వృత్తిమనునట్లు జనులమెలపు!
పాడిపంటలభూమి బహుశోభితముసేయు! మైశ్వర్యవిభవంబులమరఁజేయు
మాపూర్వవిద్యలుమహిమఁజెందఁగనిమ్ము! మాశక్తులెల్లనుమాకునిడుము!
గీ॥ అవనిసత్యంబు ధర్మంబులంకురింపఁ। బాలనముసేయుమయ్య! యీశ్వర!
కృపాళు! । భుజగపతిహార. 99

సీ॥ ప్రభువులుపాలింపఁ బ్రబలునగరంబు కాంతిబొరంగి కుగ్రామమయ్యె
పరులకుధర్మముల్ సరవిఁజెప్పునమాత్యు లాత్మవాదముల నల్లాడనయ్యె
తనువునైననొసంగి దయజూపియార్తుల బ్రోచెడిజనముల పోడిమిసెడె
నిష్టభోగములతో నెసఁగియర్థులకిచ్చు ఘనులకు లేమిడిగడలుకొనియె
గీ॥ కోణిదెనపురంబు విభవంబుఁ గోలుపోయె। నవ్యవైభవమిడి ప్రోవునాగ
భూష! । భుజగపతి... 100

సీ॥ భక్తులుచరియించు పరమంపుగోవెలల్ గబ్బిలంబులమోతఁబ్రబ్బికొనియె
కరిఘటలనుగట్టు కర్కశాలానముల్ ఘరబందులురాయ నొప్పుచుండె
తాపసశ్రేష్ఠులు కాపురంబుండెడు గిరిదరుల్ పులులకుఁదిరుగనయ్యె
భూసురవరులుండు పుణ్యగృహంబులు వందకొక్కటిలేక డిందెనాట
గీ॥ సిరులకిరవగు కోణిదెనపురంపునేటి। హైన్యమునుబాపి సంపదలమరఁజేయు
భుజగపతి... 101

సీ॥ మార్తాండసంకాశ! మదనరూపవిలాస! మంగళకర! నీకుమంగళంబు
కాత్యాయనీచిత్తకమలమధువ్రత! యంగజహర! నీకుమంగళంబు!
నిగమాంతసంచార! నిర్ధూతపాపౌఘ! మాన్యశేఖర! నీకుమంగళంబు!
కారుణ్యవిస్తార! ఖలవిదారణశూర! మహితగుణాధార! మంగళంబు!

# శ్రీ శంకర శతకము.

శా॥ వాసుఁడనుపద్యశతకంబుఁ జేసినీకు।నాయథాశక్తి నర్పింపనాఁడుఁగొనుము
భుజగపతి... ॥102

సీసమాలిక.

సరసంపుఁగవితారచనచేఁ బ్రతిభఁ గాంచి
రంజించె బుధులఁ బేరయ సచివుఁడు
తనపేరు శశిసూర్య తారకంబుగఁ గుంటఁ
ద్రవ్వించె నలజోగిరాజుగారు
రామలింగేశు నారాధ్యమై యొప్పు తో
టను నిల్పె మునువేంకటగిరిమంత్రి
వివిధ పురాణార్థ విభవ విజ్ఞానియై
క్రాలె నా అయ్యపరాజ సూరి
నెఱదాతయైవీని సరిరారెవరటన్న
మహిమ నొప్పారె రామయప్రధాని
ఆత్మవిద్యాశక్తి నలరి సత్త్వగుణంపు
సరణిఁ జెలంగె పిచ్చయ బుధుండు

గీ॥ వీరుమావంశమణులును విజ్ఞులగుట
భవ, రమాధవ, శ్రీపాదభక్తులగుట
వరమతులువారు, నే, వారివాఁడనగుట
దెలసి నుతిసేసి మ్రొక్కెద దేవదేవ!
భుజగపతిహార కొణిదెన పురవిహార
భక్తమందార! శంకర! భవవిదూర.

సీ॥ సురుచిరాపస్తంబ సూత్రుండ కౌండిన్య వరగోత్ర కొణిదెనవంశభవుఁడ
విబుధవిధేయుండ వేంకటనారాయణాఖ్యుండఁ ద్వత్పద ధ్యానరతుఁడ
నిధివారినిధి గజనీరజవైరుల సంఖ్యఁజెన్నగుచును జరుగుసమను
ప్రభవాబ్ద మార్గశిరబహుళైకాదశీ యిందువారమున నీయందుభక్తి
నీసీస శతకంబు నింపుగా రచియించి నీపాదములకడనిల్పి దీనిఁ